# అన్నమయ్య శృంగార నీరాజనం

(అన్నమయ్య అష్టవిధనాయికల వర్ణనలతో)

వ్యాఖ్యాత

**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**

M.Com., M.A.,M.Phil.,Ph.D.,

**టేకుమళ్ళ ప్రచురణలు**

**16-6-81 శ్రీనివాస అగ్రహారం**

**నెల్లూరు**

# అన్నమయ్య శృంగార నీరాజనం

**వ్యాఖ్యాత: డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**

**ప్రతులకు:**
**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**
శ్రీనివాస అగ్రహారం
**నెల్లూరు - 524 001, ఆం.ప్ర.**
**ముద్రణ :** ప్రథమ ముద్రణ
క్రోధినామ సంవత్సరం, చైత్రమాసం
ఏప్రిల్ 2024.
**ప్రతులు :** 300 కాపీలు
**మూల్యం:** రూ. 125/-
రచయిత చిరునామా:
**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**
3 వ మెయిన్ రోడ్డు
16-6-81 శ్రీనివాస అగ్రహారం
విజయమహల్ దగ్గర
నేతాజి పైలట్ స్కూల్ ప్రక్కన
**నెల్లూరు - 524 001, ఆం.ప్ర.**
**ఈమెయిల్:** tekumalla.venkatappaiah@gmail.com
**ఫోను:** 9490400858, 91105 80418

**డి.టి.పి:** **డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**
**కవర్ డిజైన్:** జోస్యుల వేణుగోపాల్, విజయవాడ (94404 36806)
**ముద్రణ:** ఇండియన్ ప్రింటర్స్, విజయవాడ.2 (94402 18158)

# నా మాట

అన్నమయ్య పేరు తలుచుకుంటేనే ఒక ఆనంద పారవశ్యం. ఒక పులకరింత. ఏదో తెలియని అలౌకికానుభూతి నన్ను చుట్టుముడుతుంది. నా నిత్య దైవప్రార్థనలో నెలకొన్న దైవం అన్నమయ్య. నా దృష్టిలో సంగీతత్రయం అంటే అన్నమయ్య, రామదాసు, త్యాగరాజులు మాత్రమే. వీరు వరుసగా సాహిత్య, భక్తి, సంగీత సముద్రాలను సృష్టించారు. వీరు లేకపోతే తెలుగు సంగీత–భక్తి సంప్రదాయం యింత వైభవోపేతంగా ఉండేది కాదేమో!

గతంలో చెప్పినట్టు నేను నెల్లూరు వెంకటగిరి రాజా గారి హైస్కూల్లో 1968వ సం.లో ఆరవ తరగతి చదువుతున్నప్పుడు, పదేళ్ళ వయసులో పాఠ్యభాగంగా వచ్చిన "తాళ్ళపాక అన్నమాచార్యులు" పాఠం సుమధురంగా కళ్ళకు కట్టినట్టు బోధించిన శ్రీ పి.ఎం.గోపాలాచారి అయ్యవారిని ఎప్పటికి మరువలేను.

తరువాతి కాలంలో తి.తి.దే వారు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, సాధు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు లాంటి ఉద్దండ దిగ్గజాలు అన్నమయ్య కీర్తనల రాగిరేకులను పరిష్కరించడం, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, నేదునూరి కృష్ణమూర్తిగారు, మల్లిక్ గారు, గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ లాంటి వారు వాటిని స్వరపరచడం, గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్, శోభారాజ్ వంటివారు అన్నమాచార్య ప్రాజెక్టు ద్వారా, ఆ కీర్తనలను వివిధ సభల్లో ఆంధ్రప్రదేశ్ నలుమూలలా అత్యద్భుతంగా పాడడం, అప్పటి ప్రాజెక్టుడైరక్టరు శ్రీకామిశెట్టి శ్రీనివాసులుగారు సుస్వర వ్యాఖ్యానతో అలరించడమే కాకుండా, వాటిని క్యాసెట్లుగా, సీ.డీ.లుగా రూపొందించి గాయకులకు భక్తులకు అందజేయడం వంటి సంఘటనలకన్నింటికి నేను ప్రత్యక్ష సాక్షిని.

విద్యాభ్యాసం తర్వాత, 1978 సం.లో ఉద్యోగ నిమిత్తం విజయవాడలో స్థిరపడ్డ తర్వాత, కొంతకాలం అన్నమయ్య ధ్యాస తగ్గినప్పటికి, 1982 సం.లో నా వివాహానంతరం, నా అర్ధాంగి శ్రీమతి చిదంబరి మంచి గాయని కావడం, పలు అన్నమాచార్య కీర్తనలను కచేరీల్లో గానంచేస్తూ ఉండడం వలన మళ్ళీ అన్నమయ్య సాహిత్యంపై నా ఆసక్తి చిగురించింది. తి.తి.దే వారి అన్నమయ్య సాహిత్యాన్ని అన్ని సంపుటాలను తెప్పించుకొని పరిశోధనలో ఉన్న తరుణంలో, శ్రీ తాడేపల్లి పతంజలి, శ్రీ జి.బి.శంకరరావు, శ్రీ వేటూరి ఆనందమూర్తి వంటివారి పరిచయ, ప్రోత్సాహాల

మూలంగా కీర్తనల వ్యాఖ్యానాలను, అంతర్జాల పత్రికలైన “మాలిక”, సిలికానాంధ్ర వారి “సుజనరంజని” పత్రికల్లో “అన్నమయ్య ఆధ్యాత్మికానంద లహరి”, “అన్నమయ్య శృంగార నీరాజనం” అన్న పేర్లతో పలు సంవత్సరాలు వ్యాఖ్యానాలు వ్రాశాను. అడపాదడపా తి.తి.దే వారి సప్తగిరి పత్రికలో కూడా నా వ్యాఖ్యానాలు వచ్చాయి. ముఖ్యంగా అన్నమయ్య అష్టవిధ నాయికల శృంగారకీర్తనల మీద వ్రాసిన “సుజనరంజని” పత్రికలో వ్యాఖ్యానం చాలా బాగుందని, అలంకార శాస్త్రాన్ని వివరించి వ్రాయడం గురించి పలువురు పెద్దలు, పాఠకులు ప్రశంసలజల్లు కురిపించడం నాకు అత్యంత ఆనందాన్నిచ్చింది. అలాగే సంగీత జగద్గురు త్యాగరాజస్వామికి ఉన్నవిధంగా తొలి తెలుగు వాగ్గేయకారుడైన అన్నమయ్యపై అష్టోత్తర శతనామావళి ఇంతవరకూ రానందున, 2019 సం.లో “శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల అష్టోత్తర శతనామావళి” నేను రచించడం నాకు అత్యంతానందాన్నిచ్చిన విషయం.

ఆ తరువార 111మంది కవి, పండిత, అవధానులచే “హరి సంకీర్తనాచార్య అన్నమయ్య” అనే పద్యసంకలనం అన్నమాచార్యులవారి సాహిత్య సంగీత సేవలను శ్లాఘిస్తూ గ్రంధ రూపంలో 2021 సం.లో అందించాను. అలాగే “భక్తి-సంగీత వరివస్య” పేరుతో సమకాలికులైన అన్నమయ్య, పురందరదాసు, వ్యాసరాయతీర్థులు, శ్రీపాదరాయలు వంటి గొప్ప సంగీత/సాహిత్య వేత్తలు కలిసి మాట్లాడుకుని ఉంటే, ఆయా సమయాలలో చర్చకు వచ్చి ఉండిన భక్తి-సంగీత-ఆధ్యాత్మిక విషయాలు ఊహించి రూపకంగా రచించాను.

తాళ్ళపాక అన్నమాచార్యులు మరియూ వారి వంశీకులు రచించిన 14వేల అన్నమయ్య కీర్తనలకు వ్యాఖ్యానాలను వ్రాయించి అందరికి సుబోధకం చెయ్యాలని తలపెట్టి, 19మంది అవధానులు, గొప్ప గొప్ప సంస్కృతాంధ్ర పండితులతో యేర్పరచిన టి.టి.డి వారి “అన్నమాచార్య ప్రాజెక్టు - పండిత పరిషత్తు”లో నాకు స్థానం లభించడం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను. శ్రీతాడేపల్లి పతంజలి “అన్నమయ్య - వెంకటప్పయ్య” ఇద్దరికి అంత్యప్రాసలతో పదాలు కుదిరాయి. మొదటి ఆయన మనసు రెండవ ఆయన గ్రహించాడు” అని అన్నమయ్యమీద భక్తితో, నా మీద ప్రేమతో అన్నప్పటికి, అన్నమయ్య మీద చిన్నతనం నుండీ నేను పెంచుకున్న మమకారమే ఈ

స్థానం నాకు లభించేట్టు చేసిందని భావిస్తున్నాను. “అన్నమాచార్య సంకీర్తనలు – 19 వ పుస్తకం” లో ఉన్న 587 కీర్తనలకు అవతారిక, అర్థ తాత్పర్యాలు, విశేషాంశాలకు సంబంధించిన వ్యాఖ్యానాలను 2023 సం.లో సకాలంలో పూర్తిచెయ్యగలిగానంటే, నాపై ఆ ఏడుకొండవాడైన శ్రీవేంకటేశ్వరస్వామికి, అన్నమాచార్యులవారికీ, ఉన్న అపార కరుణాకటాక్షాలే కారణమని భావిస్తున్నాను. నాపై అనురాగంతో, నమ్మకంతో నాకు ఆ కార్యభారాన్ని అప్పగించిన ప్రాజెక్టు డైరక్టరు శ్రీమాన్ ఆకెళ్ళ విభీషణ శర్మగారికి ఈ సందర్భంలో ప్రత్యేక కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. టి.టి.డి వారు అన్నమయ్యకు సంబంధించిన తమ భవిష్యత్ కార్యక్రమాలలో సైతం నాకు అవకాశం ఇవ్వగలరని ఆశిస్తున్నాను.

ప్రస్తుతం ఈ “అన్నమాచార్య శృంగార నీరాజనం” పుస్తకం విషయానికి వస్తే, ముందు చెప్పినట్లు “సుజనరంజని” మాసపత్రికలో చదివిన కొందరు పెద్దలు దీనిని పుస్తక రూపంలో తీసుకొని వస్తే బాగుంటుందన్న అభిప్రాయం వెలిబుచ్చినందువల్ల పుస్తకరూపం దాల్చింది. ఈ నా కీర్తనలన్నీ అంతర్జాల పత్రికలో “సుజనరంజని” లో ప్రచురించి, ప్రోత్సహించిన శ్రీ తాటిపాముల మృత్యుంజయులుగారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ పుస్తకంలో అన్నమయ్య వర్ణించిన అష్టవిధనాయికలే గాక, వివిధ నాయికా నాయకుల శృంగారాన్ని ప్రాచీన ఆలంకారిక గ్రంథాలలో ఉన్న విషయాల సమన్వయంతో పొందుపరచి, వ్యాఖ్యానాలతో ఒక సమగ్ర సమాచార గ్రంథంగా మీ ముందుకు తెస్తున్నాను. ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఈపుస్తకాన్ని ఆమూలాగ్రం పరిశీలించి, తమ అమూల్య అభిప్రాయాలు వెలువరచిన శ్రీమాన్ వేటూరి ఆనందమూర్తిగారికి, శ్రీ ఆకెళ్ళ విభీషణశర్మగారికి, శ్రీ జయశ్రీ కుమార భారవిగారికి (జె.కె.భారవి), శ్రీ తాడేపల్లి పతంజలిగారికి సర్వదా కృతజ్ఞుణ్ణి.

అన్నమయ్య పాదాంఘ్రిరేణువు
**- టేకుమళ్ళ వెంకటప్పయ్య.**

# అభినందన

డాక్టర్ టేకుమళ్ళ వేంకటప్పయ్య గారిని ముందుగా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. వారు పంపిన నాలుగైదు పుస్తకాలనూ పూర్తిగా చదవలేకపోయినా వారి ఆసక్తినీ, శ్రద్ధనూ, ప్రాచీన ఆధునిక సాహిత్యాలలోని ప్రముఖధోరణుల వికాసాన్ని శాస్త్రీయంగా పరిశీలించిన తెఱఁగును గుర్తించి ముచ్చటపడ్డాను.

వీరి 'భక్తిసంగీత వరివస్య' వచనరూపకముగా సాగిన చారిత్రక సత్యగాథ. ఊహ లేనిదే ఏ పరిశోధనా సాగదు. తామే అన్నట్లు – సమగ్రమని చెప్పజాలక పోయినా– వారి రచన రమ్యము.

ఇట్లే వీరు కూర్చిన 'అష్టవిధనాయికలు' – 67మంది ఆధునిక కవులూ, కవయిత్రులూ అందించిన రచనలతో కూర్చిన పద్యకవితాసంకలనము. అభినయశాస్త్ర లక్ష్య–లక్షణ సమన్వితము. ఆయా విషయములలో పూర్వులకృషి కొంత మరపున పడుతున్నవేళ, ఈ గ్రంథానికి ముందు వెనుకలలో చేర్చిన విజ్ఞుల మున్నుడులునూ, వెన్నుడులునూ ఆవశ్యకములైనవే కాక పరిశీలనార్హములునూ అగుచున్నవి.

మన ప్రాచీన కావ్యనాటకాల తరువాత వచ్చిన తెలుగు వాగ్గేయ రచనలలో తాళ్ళపాక వారిదే అగ్రస్థానము. అందుకు అన్నివిధాలా తగినట్లే టేకుమళ్ళ వారి "అన్నమయ్య శృంగార నీరాజనం" ఉన్నది.

'అన్నమయ్య' అని మనం ముద్దుగా పిలుచుకొనే అన్నమాచార్యులవారే వాస్తవానికి యీ రంగాన గురుస్థానీయులు. దేశికులు. వేలకొలదిగా ఉన్న వారి 'శృంగార సంకీర్తనపద' రచనలే లక్ష్యాలుగా పెరుగదగినంత లక్షణ సామగ్రి వారి సాహిత్యములో ఉన్నది. వాస్తవానికి తాళ్ళపాకవారూ, ఆ మార్గాన క్షేత్రజ్ఞులూ క్రొత్తగా సృజించిన లక్ష్యసామగ్రికి దీటైన లక్షణ శాస్త్రం ఇంకా పుట్టలేదనే అనిపిస్తుంది. ఈ విషయంలో క్షేత్రయ్యే కొంతవరకూ అదృష్టవంతుడేమో! కనీసం ఒక్క లక్షణ గ్రంథమైనా వారి పదాలకు వచ్చింది! అదే కర్త పేరు తెలియని "శృంగారరసమంజరి" అనే లక్షణ గ్రంథము.

అన్నమాచార్యాదులకు అట్టి కృషి ఇప్పుడిప్పుడే ఆరంభమవుతున్నది. ఇందుకు ఒకవిధంగా 17 వ శతాబ్దిచివర, విస్తృతపరిధిలో సంస్కృతభాషయందు కూర్చబడిన సెయింట్ అక్బర్షా "శృంగారమంజరి"యే నాంది పలికిన తొలి లక్షణగ్రంథ మనుకొంటాను. అందులో నాయక లక్షణాలతోపాటు నాయికాది వర్గజాత్యవస్థా భేదాలూ, అష్టవిధనాయికా లక్షణాలూ, సఖీ, దూతీ మున్నగు వారి కర్మలూ, అప్పటి కందినంతవరకూ సమగ్రంగా చర్చించబడినవి. ఏ కారణం చేతనో అందులో అన్నమాచార్యాదుల ప్రస్తావన ప్రత్యక్షంగా లేకపోయినను, వారి సాహిత్యము, ఇంకనూ మొత్తముమీద అపరిశీలితముగానే మిగిలిపోయినదని తలంపవలసి యుండును.

ఆ దిశలో కొంత అస్మదాదుల కృషి తరువాత, నేటివారైన డాక్టర్ టేకుమళ్ళ వెంకటప్పయ్య మున్నగువారి కృషీ, అందుకు ప్రధాన అకరగ్రంథములైన అన్నమాచార్యులవారి శృంగార సంకీర్తన సంపుటములూ (ముఖ్యముగా ఈ 28 వ క్రొత్త సంపుటమును) మెచ్చుకోదగినవి. ఇవి ఆ లక్ష్య-లక్షణ సామగ్రి విషయంలో ఏర్పడిన కొరతను కొంతవరకు తీర్చినట్లవుతున్నవి. ఈ విషయము "శృంగారమంజరి" పీఠికలో డాక్టర్ వి. రాఘవన్ గారు అందించిన విలువైన సమాచారము వెల్లడిస్తున్నది.

మరియొక్క ముఖ్య విషయమును స్మరించి యీ ముందుమాటను ముగింతును. అది తెలుగు కన్నడములలోని పద్యకవితల్లో పేర్కొనబడిన చతుర్విధ నాయికా జాతిభేదములను గూర్చి . అవి లభ్యములైన అన్నమాచార్యులవారి రెండు సంకీర్తనములలో కలవు (చూ. ఇందలి పద్మిని, చిత్తిణి ..విభాగము).

తాళ్లపాకవారి రేకులలో ఈ నాలుగు జాతుల పేర్లూ పద్మిణి, హస్తిణి, చిత్తిణి, శంకిణి, అని మూర్ధన్యాక్షరవిన్యాసము తోనే కలవు. అట్లే 'జగదేకమోహిణి' అను సమస్తపదమున కూడా మూర్ధన్యముగనే ఉన్నది. అందుకే నేను నా థీసిస్ (1965) లో అన్నమాచార్యులు 'మోహిణి' అనే ఐదవ జాతి నాయికను కూడా అలంకార శాస్త్రానికి క్రొత్తగా చేర్చినాడేమోకదా అని సూచన చేసితిని. మోహిని,

పద్మిని వంటి వ్యస్త పదములునూ వారి రచనలలో కలవు. కానీ నాయికా జాతిపరముగా ఈ రెండు రేకులలలోని కీర్తనలందు మాత్రమే అట్లు కలదు. ఇది గుర్తింపదగిన విశేషం!

కానీ, ఇది డా.రవ్వా శ్రీహరిగారు భావించినట్లు కన్నడబాషా ప్రభావము కావచ్చును. మన నన్నెచోడుడునూ అంతకుపూర్వమే తన కుమారసంభవమున ఈ నాయికా జాతి భేదములను పేర్కొన్నాడు. ఇది కామశాస్త్ర విషయము.



ఇట్లు

**వేటూరి ఆనందమూర్తి**

**బెంగుళూరు - 560 098**

చరవాణి:97424 86122

క్రోధినామ సం.చైత్ర.శు.పాడ్యమి

09-04-2024



**ఆచార్య ఆకెళ్ళ విభీషణశర్మ**
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్టు &
ఎస్.వి.రికార్డింగ్ ప్రాజెక్టు,
తిరుమల తిరుపతి దేవస్థానములు
**తిరుపతి – 517 501**

**"తలచరో జనులు ఈతని పుణ్య నామములు" – అన్నమయ్య**

ఆర్యా!

మీకు ముందుగా నా అభినందనలు. మీరు పంపిన పుస్తకం "అన్నమయ్య శృంగార నీరాజనం" అందినది. ఆలంకారశాస్త్ర దృష్ట్యా నాయికా నాయకులను మీరు వ్యాఖ్యానించిన తీరు బావున్నది. మీపై ఆ శ్రీనివాసుని కరుణా కటాక్షాలు సదా ఉండాలని కోరుకుంటున్నాను. మరిన్ని వ్యాఖ్యాన గ్రంధాలకు శ్రీకారం చుట్టమని కోరుతూ..

**శ్రీమన్నారాయణో విష్ణుర్ వాసుదేవోభి రక్షతు!**

అభినందనలతో

**ఆకెళ్ళ విభీషణశర్మ**

క్రోధినామ సం.చైత్ర.శు.పాడ్యమి
09-04-2024

# కర్టెన్ రైజర్

"శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమవీధులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభరతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ్ళపాక అన్నమయ వచోనూత్నక్రియల్ చెన్నగున్"

**1**

"ఇహపరసాధన" మైన శ్రీనివాసునికి దేవేరులిద్దరు
"ఇహపరముల" గుట్టును శృంగార వైరాగ్యంతో కీర్తనలతో రట్టు చేసిన
అన్నమయ్యకు ఇంతులు ఇద్దరు.
ఆ భగవంతుడు – ఆభక్తుడు ఇద్దరూ ఒక్కటే – విశిష్ట–అద్వైతం.

**2**

అన్నమయ్య చలన చిత్రంలో కథానాయకుణ్ణి మలుపుతిప్పే మధుర ఘట్టం ఒకటుంది.

యతి వేషధారణతో వచ్చిన నటనసూత్రధారికి రతిభంగిమలతో కొలువుతీరిన కోవెల గోపురాన్ని చూపిస్తాడు అన్నమయ్య.

"వాటిని చూస్తుంటే ఏమనిపిస్తోంది స్వామీ!" అంటూ కొంటెగా కన్ను గీటుతాడు.

"సృష్టి యజ్ఞం చేస్తున్న తల్లిదండ్రులను చూస్తున్నట్లు ఉంది" అంటాడు, అనత సృష్టికి అసూర్యంపశ్యమైన మర్మాలను నేర్పిన అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడు.

అంతే....

మన కథానాయకుడు కళ్ళు తేలేస్తాడు.

**3**

ఇందుమూలమున తేలినది ఇది కదా...

భౌతిక శృంగారలోలత్వం నుండి దారిమళ్ళించినట్లు నటిస్తూ, గట్టుదాటించి, మెట్లెక్కించి, ఆధ్యాత్మ శృంగార రహస్య దారుల్లో విహరించడం కోసం అన్నమయ్య కవనానికి బీజం వేసినట్టు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తోంది కదా!

కథ పాకాన పడడం అంటే ఇదే మరి...

**4**

అన్నమయ్యకు సమాశ్రయణం చేసిన ఆచార్యుడు ఘనవిష్ణువు.

అతనిలో శ్రీవైష్ణవ తత్త్వాలను, అతి నిగూఢ ఆధ్యాత్మిక రహ స్యాలను నరనరాల్లో నింపిన పరమాచార్యుడు అహోబిలం ఆదివన్ శఠగోపయతి.

ఈ గురువులిద్దరూ కలిసి అన్నమాచార్యుని శృంగార, ఆధ్యాత్మిక కవన విజృంభణకు కావలసిన ముడిసరకులన్నీ ముల్లె కట్టి యిచ్చి ఆచార్య శబ్దానికి అమృతత్వం ఆపాదించారు.

**5**

1. స్వాధీనపతిక
2. వాసక సజ్జిక
3. విరహోత్కంఠిత
4. విప్రలబ్ధ
5. ఖండిత
6. కలహాంతరిత
7. పోషితభర్తృక
8. అభిసారిక

ఈ అష్టవిధ నాయికలుగా ఒక్క పద్మావతీ అమ్మవారినే ఊహించి, అర్థించి, అలంకరించి శృంగార సామ్రాజ్య పట్టమహిషిని గావించి, శ్రీవారి హంసతూలికా

తల్పంపైకి ఆహ్వానించారు మన అసమాన్య భాష్యకారుడైన టేకుమళ్ళ వారు. నిత్య నిరవద్య నిరతిశయౌజ్వల్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాది అనేక అనంత కల్యాణ గుణసాగరుడైన, శృంగార సార్వభౌముడైన సర్వసర్వం సహ చక్రవర్తి శ్రీశ్రీశ్రీ శ్రీమాన్ తిరువేంకట నాథుల వారిని దక్షిణ నాయకుడిగా మదన మకుటధారణం గావించి ఆవాహన గావించారు. అయ్యవారిని, అమ్మవారిని ఏకం చేసి సభక్తి పూర్వకంగా మంగళ నీరాజనాలు సమర్పించారు.

**6**

అన్నమయ్య నీరాజనం కేవలం 88 పేజీల చిరుపొత్తం.

దీన్ని మనకు అందించడానికి వెంకటప్పయ్యగారు సాహితీ సాగర మథనం చేశారని రసజ్ఞులకు సగర్వంగా విన్నవిస్తున్నాను.

ఒకటి కాదు. రెండు కాదు.

అలంకార శాస్త్రానికి ప్రామాణిక గ్రంథమైన సాహిత్య దర్పణాన్ని సాంగోపాంగంగా స్వాధీనం చేసుకున్నారు.

వాత్సాయన కామ సూత్రాలను ఆకళింపు చేసుకున్నారు.

రామరాజ భూషణుని కావ్యాలంకార సంగ్రహాన్ని కాచి వడబోశారు.

హేమచంద్రుని కావ్యానుశాసనాన్ని కరతలామలకం గావించుకొన్నారు.

కళ్యాణమల్లుని అనంగరంగాన్ని ఆసాంతం ఆస్వాదించారు.

రూపగోస్వామి ఉజ్వలనీలమణిని ఔపోసన పట్టారు.

జయదేవుని గీతగోవిందాన్ని హృదయానికి హత్తుకున్నారు.

భరతముని నాట్య శాస్త్రాన్ని నెత్తిన పెట్టుకున్నారు.

భర్తృహరి శృంగార శతకం బట్టీపట్టారు.

శ్రీనాథుని శృంగార నైషధాన్ని నరనరాల్లో రంగరించుకొన్నారు.

కందుకూరి రుద్రకవి జానార్ధనాష్టకాన్ని ఆమగా ఆస్వాదించారు.

విశ్వనాథుని ప్రతాపరుద్రీయమ్ని ఆరగించుకొన్నారు.

సర్వజన్ సింగభూపాలుని రసార్ణవ సుధాకరం

మధుసూధన సరస్వతి భక్తిరసాయనం

అమరుక శతకం, ఆళ్వారుల నాలాయిరం, ఆదిశంకరుల స్తోత్ర సర్వస్వం, ఆండాళ్ పాశురాలు, పుష్పబాణ విలాపం, కేశవదాసు రసికప్రియ హిందీ మూలం, నారద శాండిల్య భక్తి సూత్రాలు, వైష్ణవకవి వనమాలి రచన్ అలు, భాగవతం, విష్ణుపురాణం ఇత్యాది గ్రంధాల్ని గాలించారు. తాళ్ళపాక కవులందరిని తనవాళ్ళను చేసుకున్నాడు.

సర్వశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, గౌరిపెద్ది రామసుబ్బ శర్మ గార్ల పరిశోధనలన్నిటిని పరిశీలించారు. పరిశోధించారు. పరవశించారు. ఆ తర్వాత ఈ రచనకు ఉపక్రమించారు.

ఏ కోణంలో చూసినా ఇదొక పరిశోధనాకృతిగా నా కంటికి కనిపిస్తోందని నిర్ద్వందంగా ప్రకటిస్తున్నాను. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు డా.టేకుమళ్ళ వారికి గౌరవ డాక్టరేట్ను ప్రదానం చేస్తే ఆ డాక్టరేట్ విలువ పెరుగుతుందని చేతులు జోడించి సూచిస్తున్నాను.

**7**

పరమార్ధ శృంగారాన్ని ప్రవచించడానికి, ప్రపంచించడానికి, ప్రచురించడానికి పూనుకోవడం చిన్నవిషయం కాదు.

ఈ పుణ్యకార్యం కోసం రసోన్మాది ఎంత పట్టుపట్టడో, ఎంత పరిశ్రమించాడో, ఎంత పరిక్రమించాడో, ఎన్ని పరీక్షలు ఎదుర్కొన్నాడో, శృంగార రస సాగరాన్ని మధించి, జల్లించి, వడకట్టి ఎలా ఒడిసిపట్టాడో, ఆ అమృతసారాన్ని అరటిపండు ఒలిచినట్టు ఒలిచి మన చేతుల్లో పెట్టడానికి ఈ నిత్య శ్రామికుడి మెదడులో ఎన్ని నరాలు చిట్లి ఉంటాయో ఐమాక్సు స్క్రీన్లో 3డి లో కనిపించింది నాకు.

మీరూ ఆ  అనుభవాన్ని పొందవచ్చు.



ఎంతకావాలంటే అంత ఆస్వాదించవచ్చు.
ఆకశమే హద్దు.
నీరాజాలయకును నీరాజనం

**భవదీయుడు**

**జయశ్రీ కుమార భార్గవి (జె.కె.భారవి)**

---

'కర్టెన్ రైజర్" గురించి శ్రీమాన్ టేకుమళ్ళ వారి "టీకా" లో ఉంది ఇందులో. అది భలే ట్రెండింగ్ గా అనిపించింది. అందుకే నా విహంగ వీక్షణానికి ఆ పేరే పెట్టాను.

---

## వ్యాఖ్యానానికి వ్యాఖ్యానం

సాహితీవ్రతులు, మిత్రులు డా.టేకుమళ్ళ వెంకటప్పయ్యగారు రచించిన "అన్నమయ్య శృంగార నీరాజనం" అను పుస్తకంలో ప్రత్యక్షరాన్ని చదివాను.

"అన్నమయ్య ఆధ్యాత్మిక కీర్తనలకంటే శృంగార కీర్తనలు ఎక్కువగా రచించాడు" అన్న విషయం అందరికి తెలిసిందే. లభించిన మొత్తం తాళ్ళపాక కవుల సాహిత్యంలో 30 కీర్తనలలో "శృంగార" పదాన్ని అన్నమయ్య వాడడం నేను గమనించాను. మనం ఏవైతే ఆధ్యాత్మిక కీర్తనలుగా భావిస్తున్నామో వాటిల్లో కూడా అన్నమయ్య శృంగార పదాన్ని వాడాడు. ఇది నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

"గగనంబు దాఁకి శృంగారరసభరితమై (1-227), వటపత్ర శయన భువనపాలన జంతు ఘటకార కరుణ శృంగారాధిప (4-564) ఇలా సుమారుగా 16 ఆధ్యాత్మిక కీర్తనలలో అన్నమయ్య శృంగార పదాన్ని వాడాడు. ఇంతకీ చెప్పదలచిన విషయమేమిటంటే అన్నమయ్య నుంచీ ఆధ్యాత్మికతతో పాటు శృంగారాన్ని కూడా విడదీయలేము అని. ఈ సూత్రాన్ని బాగా మనసుకు వంటపట్టించుకున్న వెంకటప్పయ్యగారు ఒక 20 అన్నమయ్య శృంగార కీర్తనల్లో అమృతాన్ని మనందరికీ ఈ "అన్నమయ్య శృంగార నీరాజనం" పుస్తకంలో పంచిపెట్టారు. ఈ అమృతం "తాగగలిగినంత వారికి తాగగలిగినంత మహదేవ!"

అన్నమయ్య, వెంకటప్పయ్య ఇద్దరి పేర్లలోను అంత్య ప్రాసతో పదాలు కుదిరాయి. మొదటి ఆయన మనస్సు రెండో ఆయన గ్రహించాడు. అన్నమయ్య వేంకటేశుని ప్రేమగా అనేక కీర్తనల్లో "వెంకటప్ప" అని పిలుచుకొన్నాడు. "అడుగనంపినవాడు ఆయములంటినవాడు, కడలేని శ్రీ వెంకటప్పవాడు" (7-595), "శ్రీవేంకటప్పని సేవ చేయగోరి" (ప్రత్యేక సంపుటము - సంకీర్తన 97), "అలమేలుమంగ మేనూ అలనాటి విరహము యెలమి శ్రీ వేంకటప్ప-డెట్లుండెనమ్మ" (ప్రత్యేక సంపుటము - సంకీర్తన 7) కొన్ని ఉదాహరణలుగా మనం చూడవచ్చు.

వేంకటప్ప పేరు పెట్టుకొన్న ఈ వెంకటప్పయ్యగారు అన్నమయ్యను యిలా శృంగార నీరాజనం పుస్తకం రూపంలో కొలుచుకొన్నారు. తి.తి.దే ప్రతిపదార్ధ, తాత్పర్య విశేషాలతో ప్రచురించబోతున్న ఒక అన్నమయ్య సంపుటానికి వీరు వ్యాఖ్యాత కూడా! ఇది ఎంతో ఆనందించదగ్గ విషయం.

వ్యాఖ్యానానికి వ్యాఖ్యానం వ్రాసినట్లు ఉంటుంది నేను ఈ పుస్తకానికి వ్రాసే ముందుమాట.

అయినా టేకుమళ్ళవారి రచనా శైలిని నేనెక్కడ ఆనందించానో తెలియజెయ్యడానికి, కొన్ని విషయాల స్పష్టత కొరకు..."అలా అన్నారు...ఇలా అన్నారు" అని నేను ఎత్తిపోతల పథకం పాటించక తప్పడంలేదు.

ఈ 20 కీర్తనలు చదివిన తర్వాత వెంకటప్పయ్యగారి అలకారశాస్త్ర పరిజ్ఞానాన్ని మెచ్చుకోలేకుండా ఉండలేకపోతున్నాను. అలంకార శస్త్రంలో చెప్పిన నాయికా నాయకుల లక్షణాలను ఈ 20 కీర్తనలల్లో వెంకటప్పయ్యగారు సమన్వయించారు. ఈ పుస్తకంలో నా మనసుకు తాకిన, ఆలోచింపజేసిన, గిలిగింతలు పెట్టిన కొన్ని వాక్యాలు ఇవి.

01. నాయికా నాయకుల శృంగార కీర్తనల మాధుర్యాన్ని తెలియజేసే ముందుగా, కీర్తనలకు "తెరతీసే కీర్తన" (కర్టన్ రైజర్) లాంటి అద్భుతమైన కీర్తన ఒకటి అన్నమయ్య వ్రాశాడు (పుట-2)

02. నాయిక చనుదోయిని జక్కువ పక్షులతో పోల్చి చెప్తున్నాడు. జాక్కువ పక్షుల జంటకు ఎడబాటు ఉంటే ఉండవచ్చు గానీ, ఈ చన్నుల జంటకు ఎడబాటు అనేదే ఉండదట (పుట-7)

03. "శ్రీవేంకటేశ్వరా!" నను కూడిన ఓ స్వామీ! నీ ముఖారవింద కళలకు అర్థం ఏమిటి? అబద్ధంచెప్పకుండా నిజం తెలియజెయ్యి స్వామీ! అని ప్రార్థిస్తోంది నాయిక. ఆమెను లాలించి, బుజ్జగించి కౌగిట చేర్చుకుంటాడు తప్ప సమాధానమిస్తాడా? (పుట-13)

04. స్వామీ! ఎంత ముగ్ధ మనోహర రూపం మీది. పైగా అన్నింటా నేర్చిన నేర్పరివి. రసికుడవు. నిన్ను చూస్తే చాలు నాకు మళ్ళీ మళ్ళీ సర్వదా మనసు ఉప్పొంగిపోతూ ఉంటుంది. ఈ వాక్యాన్నే మనం ఆధ్యాత్మిక కోణంలో దర్శించితే

"శ్రీవేంకటేశ్వరా! నీ దివ్య సుందర రూపం చూసి ఎందరు ఋషులు, మునులు తరించలేదు!? నీ రూపు మాకు ఎప్పటికి, ఎన్ని సార్లు చూసినా తనివి తీరదు" అని కూడా తీసుకోవచ్చు (పుట–33)

05. పచ్చిగా అనే మాట దైవపరంగా వాడవచ్చునా అంటే, సమకాలీన నుడికారాలు అన్నమయ్య వాడడంలో ఏమీ దోషంలేదు. "సాధ్వీనైజ విభుం యధా ప్రాప్నోతి తథా పశుపతేః" అని శంకర భగవత్పాదులవారు శివానందలహరిలో సెలవిచ్చినట్లు ఒక పుణ్యస్త్రీ తన భర్త సాంగత్యాన్ని ఎలా కోరుకుంటుందో అలాగే భక్తుడు భగవత్సాన్నిధ్యాన్ని కోరుకోవడం సహజం. నవవిధ భక్తిమార్గాలన్నె భగవంతుని చేరడానికే అని భాగవత కర్త సెలవివ్వడం తెలిసినదే కదా! (పుట–34)

06. తననొక కథా నాయికగా భావించుకొని స్వామిని నాయకునిగా మనసున నిలుపుకొని అన్నమయ్య తాను పురుషుడు, సంసారి అయిన తాను అసలు పుంసత్వమే లేనట్లు, ఆడుదనమే తనలో నిండుకొని ఉన్నట్లు భావించి, రసిక స్త్రీలకు కూడా మనసుకందని మనోభావాలను, శృంగార మర్మాలను విప్పి చెప్పడం దైవాంశ సంభూతుడైన అన్నమయ్యకు తప్ప సాధ్యం కాదు (పుట–47)

07. మనం కనకధారాస్తోత్రం గమనించగలిగినట్లైతే మొదటి శ్లోకంలో శంకర భగవత్పాదుల వారు "అఙ్గం హరేః పులకభూషణ మాశ్రయంతీ" అంటారు. "పులకాంకురములతోడి శ్రీహరి శరీరమును ఆశ్రయించినది" అని అన్నారు. అన్నమయ్య అదే పదాన్ని ఇటు పద్మావతీ దేవికి వాడి "ఆమె శ్రీహరి ఆలోచనలు రాగానే పులకించిపోతున్నది" అంటున్నాడు (పుట–68)

08. మధ్యలో ఈ పైటచాటుమాటలేల? దగ్గరకు రావయ్యా శ్రీవేంకటపతీ అని అమ్మ అర్థిస్తోంది (పుట–86)

పై పుస్తకంలో పేర్కొన్న విధంగా టేకుమళ్ళ వారి పాండితీస్ఫోరకమైన వాక్యాలూ ఉన్నయి. అన్నమయ్య పదాలకు తెలుగుతనపు తీపిని అద్దిన వాక్యాలూ ఉన్నాయి. నేను ఆ ఎత్తిపోతల పథకంలో కేవలం కొన్ని వాక్యాలను మాత్రమే పేర్కొన్నాను. రసజ్ఞులు ఈ పుస్తకం ఆసాంతం ఇటువంటి వాక్యాల కొరకు, అన్నమయ్య హృదయం కొరకు చదివి ఆనందించవలసినదిగా కోరుతున్నాను.

వీరి ఇంటిపేరు ఉన్న టేకుమళ్ళ రంగశాయి కవి వాణీవిలాస వనమాలిక అని చక్కని గ్రంథం రచించినట్లు విన్నాను. టేకుమళ్ళ వెంకటప్పయ్య కూడా పద్యాలు వ్రాశారు. పద్య కావ్యాలకు బహుమతులు పొందారు. డా. అద్దేపల్లి రమమోహనరావు గారిమీద సిద్ధాంత గ్రంథం వ్రాశారు. నవలలు వ్రాశారు. కథలు వ్రాశారు. మొత్తం మీద వీరిలో ప్రాచీన, ఆధునిక సమన్వయ ధోరణి ఉన్నదనుట స్పష్టం. "పురాణమిత్యేవ న సాధు సర్వం, నాచాపి కావ్యం నవమిత్య వధ్యం, సంతః పరీక్షాంతరత్ భజంతే, మూఢ: పరప్రత్యయనేయ బుద్ధి" అని కదా ఆర్యోక్తి! అందుకే వీరిని సాహిత్య వ్రతులు అంటున్నాను.

1. దీపము, 2. పద్యము, 3. వస్త్రము, 4. మామిడిపండు, 5. తమలపాకులను పంచనీరాజనాలుగా చెబుతారు. ఈ పుస్తకంలో అన్నమయ్య శృంగార కీర్తనల దీపాలకు నీరాజనాన్ని టేకుమళ్ళ వారు సమర్ధవంతంగా నిర్వహించారు. మరెన్నో గ్రంథాలను ఈ శైలిలో వారు రచించాలని, అందుకు తగిన అనుగ్రహాన్ని అన్నమయ్య వేంకటేశుడు అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నాను.

"అన్నమయ్య శృంగార నీరాజనం" అను పుస్తకపు అక్షర హారతిని కళ్ళకు హత్తుకుంటూ ముగిస్తున్నాను.

**"నిగనిగని తనుకాంతి నీరాజనంబాయ (5-301)"**

**"జగతి నలమేల్మంగ చక్కదనముల కెల్ల/ నిగుడు నిజశోభనపు నీరాజనం"**



క్రోధినామ సం. చైత్ర. శు. పాడ్యమి
09-04-2024

స్వస్తి

**ఆచార్య తాడేపల్లి పతంజలి**

ప్రముఖ కవి, రచయిత,
అన్నమయ్య సంకీర్తనల వ్యాఖ్యాత.
హైదరాబాదు - చరవాణి 77805 41502

# అన్నమయ్య శృంగార నీరాజనం

అన్నమయ్య సంకీర్తనలు 16వ శతాబ్ది నుంచే ప్రజల నాలుకలపై ప్రచారంలో ఉన్నా సరయిన గుర్తింపు, ప్రాచుర్యం ఇరవయ్యోవ శతాబ్దిలోనే వచ్చింది. అన్నమయ్య రచించిన ముప్పది రెండువేల కీర్తనలకు గాను ప్రస్తుతం కేవలం పన్నెండువేలు మాత్రమే లభిస్తున్నవి. ఈ కీర్తనలలో ఎక్కువభాగం శృంగార కీర్తనలే! ఆ కీర్తనల్లో దేవదేవుని శృంగార కలాపాల వర్ణన, అలిమేలుమంగ నాయికగా, శ్రీ వేంకటేశ్వరుడు నాయకునిగా సాగుతుంది. శృంగారకీర్తనలు అనగానే జన సామాన్యంలో ఆ కీర్తనలు ఏవో అశ్లీలబద్ధం అనే అపోహ ఉంది. అసలు విషయం ఏమిటంటే, కామం వేరు శృంగారం వేరు. "కలుషమైన తుచ్ఛ కోరికతో కూడినది కామం అయితే, చతుర్విధ పురుషార్థ సాధనకై ధార్మిక చింతనతో నడిచేది శృంగారం". పదకవితా పితామహుడైన అన్నమయ్య తానే అలమేలు మంగగా, వేంకటేశ్వరునిలా, చెలికత్తెలుగా, తోడి సతి (సవతి) గా, శృంగార దూతికగా.. బహువిధమైన రూపాలతో, నాయిక రూపాలను విస్తృత పరచి నాయికా వైవిధ్యాన్ని తన కీర్తనల ద్వారా మనకు ప్రసాదించి మనలను అలరిస్తాడు. తద్వారా ఒక నూతన అలంకార శాస్త్రానికి ఒరవడి పెట్టాడు. నవరసాలలో 'శృంగార' రసానిదే అగ్రస్థానం. శృంగారం లేనిదే సృష్టే లేదు. అందువలన ఏ భాషలోనైనా శృంగారానికే ప్రాధాన్యతనిచ్చారు. అయితే, భగవత్పరమైన శృంగార సంకీర్తనా రచన ఎంతో కష్టమైన ప్రక్రియ. అన్నమయ్య ఔచిత్యాన్ని గ్రహించి, అనౌచిత్యాన్ని పరిహరించి, మనోరథ సిద్ధినీ, భగవత్సాక్షాత్కారాన్నీ పొందిన మహనీయుడు. అన్నముని శృంగార

కీర్తనలలో బాహ్యరతి వర్ణనమే తప్ప అభ్యంతర వర్ణనము కనపడదు. 'ఏలితివి', 'కూడితివి' వంటి సూచక శబ్దాలతోనే పరమార్థాన్ని చూపించాడు. భక్తికీ, శృంగారానికీ అభేద ప్రతిపత్తిగా నిరూపణ గావించిన అన్నమయ్య తన సంకీర్తనలలో అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసాలతో గూడిన విప్రలబ్ధ శృంగారానికే ఆధిక్యత నిచ్చాడు.

అన్నమయ్య శృంగార సంకీర్తనలన్నిటిలోనూ శ్రీవేంకటేశ్వరుడే నాయకుడు, అలిమేలు మంగమ్మే నాయిక. ఆయన తన భక్తి తత్వాన్ని అమ్మను, వేంకటపతినీ శృంగార నాయిక-నాయకులుగా జేసి సర్వజనామోదమైన రీతిలో బహుముఖంగా వర్ణించి తన్మయత్వం పొందిన మహాభక్తుడు. అన్నముని శృంగార కీర్తనలన్నీ శ్రీవేంకటేశ్వరునికీ అలమేలుమంగకూ ఇచ్చిన శృంగార నీరాజనాలుగా ప్రఖ్యాతి పొందాయి. ఈ సంకీర్తనలన్నీ వైష్ణవ మధుర భక్తి సాంప్రదాయ వృక్ష కొమ్మలే!

నాయికా నాయకుల శృంగార కీర్తనల మాధుర్యాన్ని తెలియజేసేముందుగా, కీర్తనలకు "తెరతీసే కీర్తన" (కర్టన్ రయిజర్) లాంటి అద్భుతమైన కీర్తన ఒకటి వ్రాశాడు. మునుముందుగా దానిని అస్వాదిద్దాం. "ఇది అన్నమయ్య రసికులకిచ్చిన సందేశం! రసిక జీవన నాట్య శిల్పానికి మూల సూత్రం, శృంగార సంకీర్తనలకు మహాద్వారం" అంటారు.

శృంగార ప్రియులకు సందేశమిస్తున్నాడు అన్నమయ్య ఈ కీర్తనలో చూడండి.

పల్లవి. విరహము వలవదు రసికులు వినరో చాటుచు జెప్పెద
తరితీపను చెఱకున నిత్తఱి బందు వండె నిదివో! ||పల్లవి ||
చ. 1 బగివాయగరా దిక దంపతులకు నెక్కడ చూచిన

చిగురుకు జేగలు వచ్చెను  చిత్తజు రాజ్యమున
తగిలి తగిలి కోవిల కూతలు మొగసాలల కెక్కెను
జగమున విరసపు బవనుడు చల్లని వాడాయ  ||విరహము ||
చ. 2 పొసగంగ నెవ్వరికైనను పొందులె జరపగ వలసెను
పసిమొగ్గలు వాడెక్కెను వసంతకాలమున
ముసగస లాడెడు తుమ్మిదల మోతల చలములు చెల్లెను
సుసరము ననె పగరాజును చుట్టము వాడాయ  ||విరహము ||
చ. 3 కలయికలే కలకాలము కాణాచులుగా బరగెను
ఇలలో శ్రీ వేంకటపతి యిచ్చిన సంపదను
యెలమిని పదారువేలకు ఇతడే మగడై నిలిచెను
కలగొని మనసనియెడి చెలికాడును దోడాయ. ||విరహము ||

(శృంగార సంకీర్తనలు–28 సంపుటం– రేకు 1805 – వ.సం. 27)

అయ్యా శృంగార ప్రియులారా! రసికులారా! రండు రండు! అంటూ ఎలుగెత్తి స్వాగతిస్తూ సమాదరిస్తూ చాటి చెప్తున్నాడు అన్నమయ్య. "అయ్యలారా రండు! మీకు విరహం ఏ మాత్రం వద్దు. చెఱకు విలుకాని (మన్మధుని) పంట అద్భుతంగా పండింది ఇక్కడ వినండి నామాట".

ఇక దంపతులకు ఎడబాటు అనేదే ఉండదు, ఒకరినొకరు హత్తుకొని తిరగడమే. ఈ చిత్తజు (మన్మధ) సామ్రాజ్యంలో చిగురుకు సైతం మంచి బలం వచ్చింది. కోకిలమ్మ కూకూ రవాలు తలవాకిటి పంచలలో విని పిస్తున్నాయి. ఈ కూ–కూ కూతలు జవ్వనుల ఎదదలలో ఇంపైనటువంటి మాధుర్యాన్ని నింపుతున్నాయి అనే అర్థంలో చెప్తున్నాడు అన్నమయ్య.

అప్పటివరకూ వేడి గాలులు వీచిన వాయుదేవుడు మనసు మార్చుకుని చల్లగాలులతో శృంగారవిహారులకు అనుకూల పవనుడయ్యాడు.

ఇక ఇప్పుడు ప్రేయసీ ప్రియులకు సమాగమం, సంగమం తప్పదు. ఆ తరుణం ఆసన్నమయినది. పసి మొగ్గలు సైతం ఈ వసంత కాలంలో ఎంత వాడిగా ఉన్నాయో చూసారా! మొగ్గలు వాడిగా ఉన్నందువల్లనే మన్మధుడు ఈ పుష్పాలను అంత సులభంగా ఎక్కుపెట్టగలుగుతున్నాడన్న భావంతో వాడాడు. క్రిక్కిరిసిన తుమ్మెదల గుంపుల మాత్సర్యాలకు కాలం చెల్లింది. ప్రేయసీ ప్రియులపై పగబూని విరహతాపాలకు గురిచేసిన చంద్రుడు ఇక ఇప్పుడు మీకు దగ్గరి చుట్టమయ్యాడు. రండు రండు ఆలశ్యం వలదు.

ప్రేయసీ ప్రియులకు కలయికయే కాణాచిగా ఉండడం గురించి చమత్కరిస్తున్నాడు. మనస్సనే చెలికాడు తోడయ్యాడు. ఇక రసికులకు విరహబాధ ఉండనే ఉండదని ఉద్ఘాటిస్తూ అన్నమయ్య శృంగార సామ్రాజ్యానికి తెరతీసి పిలుస్తున్నాడు. పదహారువేల గోపకాంతలకు మొగడై నిలిచిన శ్రీవేంకటేశ్వరుడు ఈ కలియుగంలో సర్వ సంపదలతో నిలిచాడు. సర్వసంపదలను ఇవ్వగల మూర్తి అనే భావంతో చెప్తున్నాడు.

**అర్ధములు:** వలవదు = వలదు, తరితీపు = కోరిక, ఇత్తఱి = ఇప్పుడే, వండె = పండె , బగివాయగ = ఎడబాటు, చేగలు (చేవ) = బలము, చిత్తజుడు = మన్మథుడు, మొగసాలలు = ఇంటి తలవాకిటి చావడి, పొసగంగ = అనుకూలించు ముసగస = క్రిక్కిఱియు, చలములు= మాత్సర్యములు, సుసరమున = వెంటనే, పగరాజు = చంద్రుడు, కాణాచి = చిరకాలవాసము, పరగు = ప్రసరించు, ఎలమిని = సంతోషము తృప్తి,

కలగొని = కలుగు.

ఇక అన్నమయ్య అలంకారశాస్త్రంలో చెప్పబడిన నాయికా నాయికలను ఎలా వర్ణించాడో పరిశీలిద్దాం.

**ధీరలలితుడు**

అన్నమయ్య శృంగార సంకీర్తనలలో నాయకుడు శ్రీవేంకటేశ్వరుడు. "నయతి ప్రాప్నోతి, వృత్తం ఫలం చేతి నాయక:" అనగా కధాకావ్యం మొత్తం వ్యాపించి ఉన్నవాడు, ఫలభోక్తయైన వాడు నాయకుడు. "కీర్తి ప్రతాప సుభగుండార్తవను దఖిల గుణగణాధ్యుడు, బాహావర్తిత భూభరుడై, పరికీర్తితుడగు భర్త కావ్య గీత ప్రియుడై!" అనే కంద పద్యంలో నాయక స్వరూపాన్ని "కావ్యాలంకార సంగ్రహం" లో రామరాజ భూషణుడు వివరిస్తాడు. కీర్తిప్రతాపాలు, సర్వగుణ సంపన్నుడు, భూభారాన్ని వహించేవాడు, కావ్య గీత ప్రియుడైన వాడు నాయకుడు.

ధైర్య సాహసాలను బట్టి చూస్తే నాయకులు ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీర లలితుడు, ధీరశాంతుడు అని నాలుగు విధములు. ప్రవర్తనమును బట్టి నాయకులు అనుకూలుడు, దక్షిణుడు, శఠుడు, దృష్టుడు అని నాలుగు విధములు. హేమచంద్రుడు తన కావ్యానుశాసనంలో "ధర్మ, యుద్ధ, వీర ప్రధాన: ధీరోద్దాత:, వీర, రౌద్ర ప్రధాన: ధీరోద్దత:, వీర శృంగార ప్రధాన: ధీరలలిత:, దాన, ధర్మ వీర ప్రధాన: ధీర శాంత:" అంటాడు.

ఈ నాయకలక్షణాలు అవస్థాసూచకములే కానీ నిర్ధిష్టమైనవి అని చెప్పడం కష్టం. ఒక్కోసారి ధీరోదాత్తుని గుణాలు ధీరోద్ధతునిలోనూ, అలాగే

ధీరలలితుని, ధీరశాంతునిలోనూ దర్శించగలం. కనుక ఒక సర్వలక్షణ సంపన్నుడైన నాయకుని నాలుగు పేర్లతోనూ పిలిచే వీలు ఒక్కోసారి ఉండడం మనం గమనించవచ్చు. ఈ నాయక లక్షణాలను అన్నమయ్య భగవద్విషయంలో అనేక నాయికలతో శ్రీవేంకటేశ్వరుని గల సంబధాన్ని ఉల్లేఖిస్తూ రాసిన కీర్తనలలో పైన చెప్పబడిన అన్ని నాయక లక్షణాలను శ్రీమహావిష్ణువు వివిధ అవతారాలకు మనం అన్వయించుకుని ఆనందిచవచ్చు.

ధీరలలితుడైన శ్రీకృష్ణుని అన్నమయ్య తన శృంగార కీర్తనలో వర్ణించిన విధం చూద్దాం. ధీరలలితుడు అనగా పైన చెప్పినట్లుగా "వీర శృంగార ప్రధాన: ధీరలలిత:" శ్రీకృష్ణుని అవతారంలో విష్ణుమూర్తి వీర శృంగార రసాలను రెండింటినీ సమపాళ్ళలో పోషించడం గమనించవచ్చు. గోవర్ధన గిరినెత్తడం, కంసవధ, శిశుపాలవధ, కాళీయమర్ధనం వంటి వీరోచిత కృత్యాలతో బాటూ, అష్టభార్యలతోనూ పదహారువేలమంది గోపికలతోనూ స్వామి శృంగారం నెరపినట్టు మనకు పురాణాలు, భాగవతమూ చెబుతున్నాయి. ఆ ధీరలలిత లక్షణాలను నిరూపిస్తూ అన్నమయ్య రాసిన ఈ కీర్తన చూద్దాం.

పల్లవి: ఎపుడు వత్తువో యనుచు యెదురు చూచీ జెలియ
e ψ $ T+° # ↑ ŴÜ $ T e $ < ŠCÉ < Šj ä«! ||పల్లవి ||
చ. 1. నెలంత కనుగలువలకు నీ మోము జందురుని
నలరంగ జూప గదవయ్య నేడు
కలికి చక్కదనంబు కడగి ప్రతిబింబించ
తళకు నీ చెక్కుటద్దములు చూపవయ్యా! ||ఎపుడు ||
చ. 2. నిరతిమెఇ దీగెకును నీ బాహు శాఖలివి

అరడుగా జూప గదవయ్య నేడు
సరి జన్నుజక్కవలు జంటవాయక యుండ
Ô=s\Á Ôq Td Ös Á¸±+ ÔaT T # a| ¬j a« ||ఎపుడు ||
చ.3. గళనాద పికములకు కడు నీ జవ్వనమదము
అలమి చోటుగ జూపవయ్యా నేడు
వలచి వేంకటేశ్వర ఈకె గూడితివి
కలకాలమును నిటుల గరుణ చూపవయ్యా! ||ఎపుడు ||
(రాగం: ముఖారి శృం.సం.సం.28 రాగి రేకు 1809, సం.52)

సకలసృష్టికీ ప్రభువు, లోకరక్షకుడు, ఆర్తపరాయణుడు అయిన శ్రీమహా విష్ణువు నిత్యం భక్తుల సంరక్షణలోనే మునిగి ఉంటాడు. అందువల్ల నాయిక అయిన అమ్మవారిని దర్శించవలసినదిగా కోరుతూ ఒక శృంగార రాయబారిగా అన్నమయ్య నిలబడ్డాడు. శ్రీహరి ధీరత్వాన్ని, అమ్మ లలితత్వాన్ని కలగలిపి, స్వామి వీరశృంగార గుణాలతో "ధీరలలితునిగా" మనకు శృంగార నీరాజమిస్తూ సాక్షాత్కరింప జేసిన యత్నమే ఈ శృంగార కీర్తన. శ్రీవేంకటేశ్వరుని దర్శనం కోసం విరహవేదనతో యెదురు చూపులు చూస్తూ ఉన్న నాయికను అన్నమయ్య వర్ణిస్తున్నాడు.

"స్వామీ! ఎప్పుడు మీ రాక యని యెదురు చూపులు జూచే నాయికను (జవ్వనిని)" రూపకాలంకారంలో చెప్తున్నాడు అన్నమయ్య.

అమ్మవారి కన్నులు కలువలతో పోల్చి చెప్తూ, స్వామి మోమును సుందరమయిన చంద్రునితో పోలుస్తున్నాడు. కలువలు చంద్రుని చూస్తే వికసిస్తాయి. అందువలన స్వామీ.. ఒక్క సారి అమ్మకు నీ ముఖచంద్రుని

దర్శింపజేయవయ్యా అని ప్రార్థిస్తూ... స్వామీ! నునుపెక్కిన మీ ముఖ చెక్కుటద్దముల చక్కదనానికి నాయిక చక్కదనం ప్రతిబింబించాలయ్యా ! అంటూ స్వామిని కోరుతున్నాడు నాయిక తరఫున రాయబారిగా అన్నముడు.

స్వామీ! అమ్మవారి శరీరం అనే తీవకు నీ బాహువులు అల్లుకునే తీగలు కావాలి. లావణ్య లత అనే అమ్మవారి శరీరానికి ఆధారభూతమై (అరడుగా) నీ బాహువులు చుట్టుకోవడం వల్ల అమ్మకు మరింత రక్షణ, జన్మ చరితార్థం అంటాడు అన్నమయ్య చమత్కారంగా. చక్రవాక పక్షి జంటలు ఉదయం ప్రొద్దులలో జంటగా ఉంటాయి. రాత్రిళ్ళు విరహవేదనను అనుభవిస్తాయి. ఎందుకంటే ఆ పక్షులకి కేవలం వెన్నెలే ఆహారం. వెన్నెల కోసం విడిపోతాయి. అన్నమయ్య ఇక్కడ నాయిక చనుదోయిని జక్కువ పక్షులతో పోల్చి చెప్తున్నాడు. జక్కువ పక్షుల జంటకు ఎడబాటు ఉంటే వుండొచ్చు గానీ ఈ చన్నుల జంటకు ఎడబాటు అనేదే ఉండదట. నాయకుని శరీర వెచ్చదనం (సూర్య కాంతి) సోకగానే విరహవ్యధ ఉండదు అని భావం. తుషార బిందువులచే చల్లనైన నాయిక స్తనద్వయం స్వామి సూర్యకాంతి లాంటి వెచ్చదనంతో ఎడబాటు లేని విధంగా కప్పిపుచ్చమని కోరుతున్నాడు అన్నమయ్య.

అన్నమయ్య ఈ చరణంలో "గళనాద పికము" అనే గమ్మత్తయిన పదం వాడాడు. నాయిక కంఠ స్వరంలోనుండి వచ్చే శబ్దాన్ని కోయిల కంఠస్వరంతో పోల్చడమే కాక నాయిక పరంగా "మణితము" అనే శృంగార అవస్థను కూడా మనకు తెలుపుతున్నాడు అన్నమయ్య. స్వామి జవ్వన మదము తోడైతే నాయిక కంఠస్వరం నుండి పికనాదము వంటి సవ్వడి వస్తుంది అని చెప్తున్నాడు. ఆ విధమైన ప్రేమను అమ్మ పై జూపవయ్యా ఈరోజు అని ప్రార్థిస్తున్నాడు. స్వామీ! శ్రీవేంకటేశ్వరా! వలచి ఈ అమ్మవారిని

చేరావు. కలకాలము ఈ రీతిగా కలసి ఉండి ఎల్లవేళలా నీ కరుణను జూపవలసినది అని ఒక అర్థంలో చెప్తూ, అన్యాపదేశంగా "జీవాత్మ-పరమాత్మలను ఈ రీతిగా ఎల్లప్పుడూ కలసిఉండేట్టు చూడవలసినదిగా నా విన్నపం ప్రభూ! అని వేడుకోవడం ఆధ్యాత్మికతను శృంగార రసంతో కలగలిపిన రీతిగా మనకు తోస్తుంది.

**అర్థములు:** ఉపమించి = పోల్చి, ఉవిద = స్త్రీ, జవ్వని, అలరంగ = సంతోషపెట్టునట్లు, తళ(ళు?)కు = మిక్కిలి ప్రకాశము, నిరతి = ఆశక్తి మెఇ(యి?) = మాదిరిగా (తృతీయావిభక్తియందు వచ్చెడు 'మెయి' ప్రత్యయము) అరడు = ఏరు లేక నది దాటే ఒక కొయ్య దుంగ వంటి సాధనము, వాయక = వదలిపెటక. పికము = చాటునుండి కూయునది, కోయిల, అలమి = క్రమ్ముకొని ఈకె, ఈపె = ఈ స్త్రీ.

**గమనిక:** కీర్తనలో "నిరతి మెయి" అని ఉండవలసిన చోట "నిరతి మెఇ" అని ఉన్నది. ఇచ్చట యడాగమమూ, సంధి కలుగలేదు.

-000-

## దక్షిణ నాయకుడు

అనాదిగా మన భరతఖండం ఒక ఆధ్యాత్మిక క్షేత్రం. ఆత్మానుభవంతో సత్యశివసుందరమైన దృక్పథాన్ని కలిగించిన వైదిక మహర్షులే మన ఆది ఆధ్యాత్మిక గురువులు. ఆ కోవలో ఆత్మకూ పరమాత్మకూ ఉన్న సంబంధాన్ని రాధాకృష్ణ లీలలుగా అభివర్ణించారు వైష్ణవాచార్యులు. నమ్మాళ్వార్ రచించిన 'తిరువాయి మొజ్షీ విరహిణి గీతాలపమే! మహారాష్ట్రలో మీరాబాయి, తెలుగు నేలపై అన్నమయ్య ఆ కోవలో ముఖ్యులు. అన్నమయ్యకు తర్వాతి కాలం వాడైన రూపగోస్వామి "ఉజ్జ్వల నీలమణి" అనే గ్రంథం రాశాడు. దానిలో శృంగారమూర్తి శ్రీకృష్ణుడే నీలమణిగా భాసిల్లాడు. భగవదనుభూతి యోగ్యమైన శాంత, ప్రీతి, ప్రేయస్సు, వత్సల, ఉజ్జ్వల రసాలలో, ఉజ్జ్వల ఓ శ్రేష్టమైన భక్తి రసం. శ్రీ మధుసూధన సరస్వతి కూడా తన "భక్తి రసాయనం" లొ భక్తిలోనుండి శృంగారం మొదలైన అనేక రసాలు పుడతాయని చెప్పారు. ఇంద్రియాలను అంతర్ముఖం చేసుకుని, అగాధం, విశాలం అయిన ఈ సూక్ష్మ ప్రపంచంలో ప్రవేశించి అనిర్వచనీయమైన సత్యాన్ని, సౌందర్యాన్ని గుర్తెరిగి తన సంకీర్తనలతో ఒక నూతన భక్తి సామ్రాజ్యాన్ని సృష్టించిన అన్నమయ్య ఘనత మాటలలో కొలువజాలము.

అన్నమయ్య తెలుగు భాషలో సాహిత్య రసికతను ఒక వాగ్గేయకారునిగా విభిన్న మార్గాలలో ప్రస్ఫుటింపజేశాడు. రసికుడు అనే మాటను మనం గమనిస్తే, రసికుడనగా శృంగారి. రస్యమానతా హృదయం ఉన్నవాడు అన్న అర్థాలు తెలుస్తాయి. కానీ రసికుడంటే కేవలం శృంగార

✓ లోలుడు కాదు. రసార్ద్ర చిత్తవృత్తి గల కవి తన సంకీర్తనలు లేదా కావ్యాల ద్వారా రసమయ జగత్తును సృష్టించే నేర్పరి. అలాంటి పవిత్ర భావాలతో, స్పందనలతో, చేతనలతో సాహిత్యాన్ని జాగ్రత్తగా ఆవిష్కరించగల కవి చరిత్ర పుటల్లో చిరంజీవిత్వాన్ని పొందుతాడు.

"శ్లో. త్యాగీ, కృతీ, కులీన: సుశ్రీకో రూప యౌవనోత్సాహహే!,దక్షో నురక్తలోకస్తేజో వైదగ్ధ్య శీలవాన్ నేతా" అని సాహిత్య దర్పణం నాయకగుణాలను విపులీకరించింది. త్యాగము, కృతజ్ఞత, కులీనత్వము, సుశ్రీకత్వము, రూపవత్త్వము, యౌవనము, ఉత్సాహము, సర్వజనానురాగము, తేజము, వైదగ్ధ్యము, శీలము అనే గుణాలు నాయకునిలో ఉండాలి అని అర్ధం. నాయకుని ప్రవర్తనకు అనుగుణంగా 1.అనుకూలుడు 2.దక్షిణుడు 3.శఠుడు 4.ధృష్టుడు అనే రకాలుగా ఉంటారని అనుకున్నాం. అలాగే... ధీరోదాత్తాది నాయకులు అన్ని రకాల రూపాలలోనూ ప్రతిబింబిస్తుంటారు. శృంగార విషయంలో దక్షిణనాయకుడు అంటే పెక్కండ్రు నాయికల యందు సమాన ప్రీతి గలవాడు. శ్రీకృష్ణుడు దీనికి మంచి ఉదాహరణ. ఒక్క అనుకూలునికి మాత్రమే ఉదాహరణగా శ్రీరామ చంద్రుడిని తీసుకోవచ్చు. మిగిలిన శఠ, ధృష్టుల గుణగణాలూ శ్రీ కృష్ణునికే అన్వయించుకోవచ్చు అంటారు సాహిత్యకారులు. ప్రస్తుతం అన్నమయ్య వర్ణించిన దక్షిణ నాయకుని గూర్చి తెలుసుకొందాం.

పల్లవి: గుఱుతులెల్లా గంటిమి గుట్టు సేయ నికనేల
e T T>T Ty î ¼¿£e ÖÔÃCÉÎe j ä« ||పల్లవి ||

చ. 1. చెలియ ముడుచుకున్న చెంగలువ పువ్వులు

యెలమి నీకొప్పులోని కేల వచ్చెను
పొలుపుగా జన్నులపై బూసిన గంధము నీమై
వెలయగ నంటుకొన్న విధమానతీయవయా! ||గుఱుతు||
చ.2. ఆ కాంత గట్టుకొన్న యట్టి చంద్రగా(కా?) వి చీర
నీకు దట్టియైనట్టి నెపమేటిది
మేనొని యాపె పాదాల మించులును మెట్టెలును
యీ కాడ నీవేళ్ళనున్న దిదేమి చెప్పవయా! ||గుఱుతు||
చ.3. సుదతి చెవిలోనున్న సొంపైన తట్టుపుణుగు
చెదరి నీపచ్చడాన జెందియున్నది
అదన శ్రీవేంకటేశ అట్టెనన్ను గూడితివి
పొదలీ మోము కళలు బొంకక చెప్పవయా! ||గుఱుతు||
(రాగం: పాడి, శృం.సం.సం.28, రాగి రేకు 1889, కీ.సం.522)

పై కీర్తనలో ఇతర నాయికలతో కూడి అలసి వచ్చిన దక్షిణ నాయకుడైన స్వామిని దేవేరి నిలదీస్తోంది. "స్వామీ! నీశరీరంపై సాక్షీభూతంగా ఉన్న అన్ని గుర్తులూ చూశాను. ఇంకా గుట్టెందుకు? చెప్పండి. ఇంకా దాపరికం ఎందుకు మాతో జెప్పండి" అంటోంది ఛలోక్తిగా దేవేరి. నవ్వు రాజిల్లెడు మోమువాడు మాత్రం ఏమీ సమాధానం చెప్పడంలేదు. అవునుస్మీ! ఈ గుర్తులు ఎలా వచ్చాయి అని అలోచనలో పడ్డాడు. ఒక్కొక్కటీ గుర్తొచ్చినకొద్దీ మోముపై చిరునవ్వు వస్తోంది. దానికి దేవేరికి కోపం ఇంకా అధికమౌతోంది. చివరికి ఏమౌతుందో చూద్దాం.

దక్షిణ నాయకుడైన స్వామిని దేవేరి గట్టిగా నిలదీస్తోంది. "నీశరీరంపై

ఉన్న అన్ని శృంగారపరమైన గుర్తులూ గమనించేశాం. ఇంకా గుట్టు మట్టులెందుకు? ఇంకా విషయం మరుగు పరచడం ఎందుకు? జెప్పండి" అని అడుగుతోంది అప్పటివరకూ విరహోత్కంఠితావస్థ ననుభవించిన గడుసు నాయిక.

స్వామి తప్పించుకోవడానికి వీలులేకుండా దాడి చేస్తోంది నాయిక. "స్వామీ! ఎందుకా మౌనం? ఎవరో అమ్మాయి తలలో పెట్టుకున్న చెంగలువ పూలు తమ కొప్పులోకి ఎలా చేరాయో చెప్తారా? స్త్రీలు వక్షోజాలపై పూసుకునే గంధం నీ వక్షస్థలం పై అంటుకుని వుండేమిటి స్వామీ? ఆ వ్యవహారం ఏమిటో తాము ఆనతిస్తే వీనులవిందుగా వినాలని ఉంది" అంటోంది గడుసు నాయిక. స్వామికి ఏం చెప్పాలో తెలీడం లేదు. స్వామికి చిన్నతనం నుండి చెంగలువ పూలు అంటే మహా ఇష్టం. "చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ / బంగరు మొలత్రాడు పట్టుదట్టి / సందిట కడియాలు సరిమువ్వ గజ్జెల" అన్న తన బాల్య స్థితి గోచరించి నవ్వొచ్చింది స్వామికి. ఏం చెప్పాలో తెలీలేదు. ఆ చిరునవ్వులను చూసి నాయికకు కోపం హెచ్చింది.

ఇదేమి చోద్యం స్వామీ! ఆ పడతి గట్టుకున్న ఎరుపు రంగు చీరె మీ శరీరంపై నడుముకు చుట్టబడి ఉన్నదేమిటి మహానుభావా? చెప్పండి? ఏమి జరిగింది? ఎలా జరిగింది? ఆమె కాళ్ళకుండవలసిన మెట్టెలు నీ కాళ్ళకున్నాయేమిటి? చెప్పవయా? అనగానే స్వామి గబుక్కున తన నడుం వేపు, కాళ్ళవేపు చూసుకున్నాడు వంగి. నిజమే! అవును ఇవి ఎలా వచ్చాయి అని అలోచనలో పడ్డాడు. ఈ సందర్భంలో మనకు పోతన "నల్లనివాడు, పద్మనయనమ్ముల వాడు...అనే పద్యంలో నవ్వు రాజిల్లెడు మోమువాడొకడు

చెల్వల మాన ధనంబు దెచ్చెనో...మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే!" అని మల్లె పొదలను ప్రశ్నిచడం గుర్తొస్తుంది. కన్నయ్య ఎంతటి గడుసు వాడు కాకపోతే చెట్లను, పుట్లను కూడా అడుగుతాడు పాపం పోతన.

ఆమె చెవిలోనున్న సుగంధ భరితమైన తట్టుపునుగు నీ అంగవస్త్రానికి ఎలా అంటుకున్నదయ్యా స్వామీ! బదులు పలకండి! అన్నా వీటికి స్వామి సమాధానం ఇవ్వనే లేదు. "శ్రీవేంకటేశ్వరా ! నను కూడిన ఓ స్వామీ! నీ ముఖారవింద కళలకు అర్థం ఏమిటి అబద్ధం చెప్పకుండా నిజం తెలియజెయ్యి స్వామీ!" అని ప్రార్థిస్తోంది నాయిక. ఆమెను ఆలించి, లాలించి, బుజ్జగించి కౌగిట చేర్చుకుంటాడు తప్ప సమాధానమిస్తాడా?

**అర్థములు:** చంద్రకావి, చెంగావి = ఎఱ్ఱని వర్ణము లేక కాషాయవర్ణము, దటి = తువాలు, తుండుగుడ్డ (నెల్లూరు మాండలికం), తట్టుపుణుగు = పునుగుపిల్లి వలన లభించే సుగంధ ద్రవ్యం, పచ్చడము = వస్త్రము (వేడినిచ్చు వస్త్రము).

-000-

# ధృష్ట నాయకుడు

అన్నమాచార్యుని రచనల్లో ఆధ్యాత్మిక కీర్తనలకన్నా శృంగారకీర్తనలే ఎక్కువ. ఇవి లీలా పదములు. శ్రీవేంకటేశ్వరుని ఆనంద లీలావిహారములే ఈ కీర్తనలలోని వర్ణ విశేషములు. భక్తుల దృష్టిలో భగవంతుని సర్వసాధారణ లీలావిన్యాసానందమే పరమానంద భరితం. భగవంతుని లీలలు బహుముఖాలు. భగవంతుని అనవరత లీలాభావనా సంబంధ స్థాపనాదికముచే తత్ర్పాప్తి నాసించి కైవల్యము నొందుటయే భక్తుని పరమావధి. అన్నమయ్యలో ఆ లీలారసానుసంధానము లీల గాన రూపసాధనగా సాక్షాత్కారం జరిగింది. అన్నమయ్య అందువలననే శృంగార సంకీర్తనలను భగవంతుని బాల, కిశోర, యవ్వన లీలలను అనంతముగా వూహించి విశద విస్తృతిలో వర్ణించి తనదైన ఒక భావనామయ రసప్రపంచాన్ని వెలయించాడు.

భరతాచార్యుడు చెప్పిన విధంగా ఈ ప్రపంచం లో ఏది పవిత్రమో, శ్రేష్టమో, ఉజ్జ్వలమో, దర్శనీయమో అదే శృంగారము. అలాంటి పరమ పవిత్రమైన, భగవన్నిష్టమైన శృంగారము భక్తిపూతమైతే సర్వోత్కృష్టమని వేరు చెప్పనక్కరలేదు. అన్నమాచార్యుని శృంగార కీర్తనలు భక్తి భావ బంధురాలై, లౌకిక వాసనలకు బహుదూరమై, అలౌకిక ప్రపంచపుటంచులలో సాగినవి. విశిష్టాద్వైతియైన అన్నమయ్య జీవాత్మ పరమాత్మలకు "అపృధక్ సిద్ధసంబంధ" మంగీకరించి విశ్వసించి, ఉద్దామ విరహ కల్పనలకే ప్రాధాన్యమిచ్చాడు తప్ప, విరహ వర్ణనల జోలికి పోలేదు. అన్నమయ్య కీర్తనలలో ఆధ్యాత్మిక కీర్తనలలో "ప్రపత్తిని" శృంగార కీర్తనలలో "స్వీకృతిని" దర్శించి తరిద్దాం.

నాయకులలో దక్షిణ నాయకుని తర్వాత "ధృష్ట నాయకుని" అన్నమయ్య కీర్తించిన విధం పరిశీలింపదగ్గది. పరవశింపదగ్గది. ధృష్ట నాయకుని రామరాజభూషణుడు తన కావ్యాలంకారసంగ్రహంలో "అన్యాంగనా భోగరూప, శృంగారాపరాధము చేసిన నాయకుడు, ఆ యపరాధమును గప్పి పుచ్చుకోడానికి కల్లలాడే విధముగా వర్ణిచాడు. సాహిత్య దర్పణములో "శ్లో. కృతాగా అపి నిశ్శంక స్తర్జితోపి, నలజ్జిత: దృష్టదోషోపి మిధ్యావాక్యధితో ధృష్ట నాయక:" అని చెప్పబడింది. అంటే అపరాధము చేసినా జంకూ గొంకూ లేని వాడు, తర్జింపబడిననూ, లజ్జింపనివాడూ, తన దోషం కంటికి కట్టినట్టు కనిపిస్తున్నా ఇంకా ఏవో మాయమాటలు జెప్పి నచ్చజెప్పలనే ధోరణి కలవాడు ధృష్ట నాయకుడు. అలాంటి ధృష్ట నాయకుని అన్నమయ్య తన కీర్తనల్లో ఏవిధంగా వర్ణించాడో చూద్దాం.

పల్లవి: మనసులో తమకము మాకునిట్టే కానరాగా
q q THî ÔáÔû +# ê ÚH ³ ÅE& fú e Ú ||పల్లవి ||
చ. 1. పువ్వు వంటి జవ్వనము పొద్దొక వింతై రేచీ
రవ్వలు సేయక ఇట్టే రావయ్యా నీవు
వువ్విళ్ళూరీ జెమటలు వూటలై నీ మేనను
నవ్వులేమి నవ్వేవు నాతో నింకా నీవు ||మనసులో ||
చ. 2. కొడిసాగి కోరికలు గుంపులుగా నల్లుకొనె
అడియాసలేల విడె మందియ్యవయ్యా
కడగి నివ్వెరగులు కానవచ్చె నీవల్ల
వొడియాల పట్టి పాడే వూరకే నీవు ||మనసులో ||

చ.3. చిమ్మిరేగిన సిగ్గులు చిదుముడి సందడించె
నెమ్మది గూచొండవయ్య నీవు నావద్ద
యిమ్ముల శ్రీవేంకటేశ ఇట్టె నన్నునేలితివి
నమ్మికలెన్నిచ్చేవు నయాననే నీవు ||మనసులో||

(రాగం: ఆహిరి, శృం.సం.సం.28, రాగి రేకు 1851, కీ.సం.296)

నాయిక నాయకునితో పలికే పలుకులు మనమూ ఆలకిద్దాం. ఓ స్వామీ నీ నాటకాలన్నీ మాకు విదితమై పొయ్యాయిలే. ఇంకా కల్లబొల్లి మాటలు చెప్పవద్దు. నీ మనసులోనున్న కోరికలు మాకు తెలీదనుకున్నావా? అంటూ ఆటపట్టిస్తోంది ధృష్ట నాయకుణ్ణి నాయిక. ఆవ్యవహారం సవివరంగా తెలుసుకోవలసిందే..

స్వామీ! పరనాయకి పై తమకున్న మోహము, కాంక్ష మేము ఇట్టే పసిగట్టగలం సుమా! నీమోములో ఎన్ని విషయాలు దాగిఉన్నా గ్రహించగలను. నన్ను ఎన్ని మాయమాటలతో నాటకాలాడి తేలించినా నీ గుట్టంతా మాకు ఎరికే స్వామీ అంటొంది నాయకి.

| ÜéÚÇy ²+{ ì j ãe Çq e TTÔÃ – H •q T. m“ • b õ< ŠÝ T ú ÂÕ
| Ÿ| Ÿ$ < ô T>±y û # ãÖ d q T k ÍÇMT…H Å£ n | ¿Y] ïs Å£+ &† # ãÖ&ƒT.
, +¿± @$ T{ ì # ãÖ d ŸH •s Á k ÍÇMT… , ³ Ts Á& k ÍÇMT y îT< Š . MT
Xø s Á |™Õ# ê T³ \ T# ãÖ&ƒ& ¿Ã] ¿£ ÔÃY²ÔÃY²Y\ ÔÃ e P³ ý Õ< ós Á T>±
¿±s ÁÔãH •s TT. , +¿± ‡ VŸk Í« T@$ T{ ?. m+< ŠÅ£ q e ÚÇÔãH •s Á?
y û Í\ T m+< ŠÅ£ y k Íïs Á? #| Ÿ+& e ÖÅ£ n ú • Ô Î Td Ÿ n +{ ¤+~
H s TT¿£ k ÍÇ$ T n d ÿ ñ< ŠwŸ¼ j ãÅ£&ƒT >± e TÖ¯ ü $ +º – H •&ƒT.
n | Ÿ < ô T# ã H¼ @e ÖÇÔá d ¾TZ Ÿ“ƒy &†j îT!

అంతకంతకూ వర్ధిల్లే కోరికలు గుంపులు గుంపులుగా నన్ను అలుముకొంటున్నాయి స్వామీ.. నా కోరికలను ఎందుకు అడియాసలు చేస్తావు? తాంబూలం అందియ్యండి. ఇంకా ఆలశ్యం ఎందుకు చేస్తారు రంగంలోకి దిగండి అని నాయకి స్వామిని వేగిరపరుస్తోంది తమకంతో. చివరకు నీవలన నాకు అదో భయం లాంటిది కలుగుతోంది. నన్ను ఒడిసిపట్టి వూరకే పాటలు పాడుతున్నారు. తగదు స్వామీ మీకు ఈ హాస్య ధోరణి అంటోంది నాయిక.

సిగ్గు విపరీతంగా విజృంభించి వస్తోంది. తొందరపాటుతో నా మనసు వశం తప్పుతోంది. ఇలా రా స్వామీ నెమ్మదిగా నా చెంత ఆశీనులుకండి. నాతోకూడి ఉండే శ్రీనాథా! శ్రీవేంకటేశ్వరా! నన్ను ఏలినవారు మీరే! నన్ను లాలించి పాలించి ఎన్ని నమ్మికలిచ్చేవు స్వామీ..రా.స్వామీ నన్ను పరిగ్రహించండి అని కోరుతోంది నాయిక.

**అర్థములు:** తమకము = కాంక్ష, మోహము. నాటకుడ = బూటకము, మోసము. రవ్వ = నింద, అపకీర్తి. వువ్విళ్ళు = ఆశ, తహ తహలు, వూట = తరగనిది, కొడిసాగు = కొనలుసాగు, వర్ధిల్లు = నివ్వెరగు= మిక్కిలి భయము, నిశ్చేష్టత = నేర్పు, ఒడుపు. చిమ్మిరేగు = మిక్కిలి విజృంభించు చిదుముడి = వ్యాకులత, తొందర, ఇమ్ముల = వసించు, కాపురముండు నయాన = సముదాయించు.

-000-

## శరుడు

అన్నమాచార్యుని శృంగార కీర్తనలలోని గొప్పదనం ఏమిటంటే, నాయక, నాయికలను ఏ పరిస్థితులలోనూ లౌకికస్థాయి శృంగారస్థాయికి దిగజార్చకపోవడం. శ్రీవేంకటేశ్వరుని ఏ నాయక రూపంలో మనకు సాక్షాత్కరింపజేసినప్పటికీ ఆ పరంధాముని దివ్యత్వానికీ ఏమాత్రం భంగం కలుగజేయకుండా ఉదాత్త గంభీరునిగా మనకు దర్శింపజేయడం. అలాగే అలమేలు మంగమ్మనూ మనకు దివ్యమైన శోభతో దైవత్వం ఉట్టిపడేట్టు ప్రతిపాదించడం, మధుర గంభీరమూర్తిగా మనకు నిరూపింపజేయడం. బహువ్యాపకుడైన నాయకుడు నాయిక వద్దకు వెంటనే రాక కాలయాపన జేసినప్పటికీ మానవ సహజగుణములను వారికి ఆపాదించక సర్వత్రా వారిని దైవ పీఠం మీదే నిలిపి ఉంచడం.

ఈ కీర్తనలో స్వామి "శరుడు" అనగా స్వామి చేసే అనుచితకార్యాలు దేవేరికి మాత్రమే తెలిసేట్టుగా చేయడం శరుని గుణంగా అలంకారికులు నిరూపించారు. శరుడు నాయికకు తప్ప ఇతరులకు తెలియకుండా తప్పులు చేసేవాడు అని అర్ధం. శరుడైన నాయకుని తీరు మనం ఇప్పుడు ఈ క్రింది కీర్తనలో చూద్దాం.

పల్లవి: మచ్చికెంత గలిగినా మఱగు మొఱగు లేదా
ఇచ్చ యెరిగి లోలోన యొనయుటగాక ||పల్లవి||
చ.1 గుట్టుతోడ జవరాలు కుచములు దాచుకోగా
చుట్టమువలెనే తొంగి చూడ వచ్చేవు
చిట్టకములు సేయగా సిబ్బితిగల యాటది
వొట్టు వెట్టక మానునా వూరకే జంకించేవు ||మచ్చికెంత||

చ.2. వాసి తోడ ముద్దరాలు వదనము వంచుకుంటే
సేసకొప్పు జారదీసి చెక్కునొక్కేవు
బేసబెల్లి చేతలకు పేరుకల పూవుబోణి
ఈసడించ వలదా నీవేల తమకించేవు ||మచ్చికెంత||

చ.3 వోజ తోడ చదురాలు వోవరిలో నుండగాను
రాజసాన బచ్చిదేర రతిగూడేవు
తేజముతో మన్నించగా తేకువగల కోమలి
సాజపు శ్రీవేంకటేశ సంతోసించకుండునా ||మచ్చికెంత||

(రాగం: భైరవి, శృం.సం.సం.28, రాగి రేకు 1805. కీ.సం.24)

]™Õ¿sÁý Ë <ê<êu&T È] | ðá Xø+>±sÁ¿£²bÍ\ T <ûÛ¿ì
Ôî dbï|| ãsTT. kÍÇ$T n&T>TÔÃ+~. kÍÇMT! €yîT]™ÕŒ+Ôáç eT
–+f ñeÖçÔá dËTï ä+ d¥<ŠÆ n¿£ØÁñ'? q\ T>T] ý Ë €yîTqT
n\ ¢bÍ\ T#êÍs ? n" n&T>TÔÃ+~. kÍÇ$T#û ¿±s « ú• @MT
>T³ T¼'#ã¿Ã&T nú• <ûÛ¿ì#î| ÎdÖï–+{ ²&T ýñ' Ôî df ú#dÖï
–+{ ²&T. ný²+{ ì ÿ ¿±H=¿£ d¥| ³ qý Ë º ÅÆÅ£q• kÍÇ$T
n\ yîT TeT+>eT ¢Xø esÁ Å] | ¦bï+~. nsTTH dËÖ<ôq+
ed¥+<'? kÍÇ$Tn" •{ ì¡º sÁq y ÇdËÖ<ôq+ nq•³ T¼+{ ²&T.

kÍÇMT! € H sTT¿£™ÕMTÅ£ m+Ôáe TÅÆ , € dŸï , w¥¼–H •,
# ³ TeÖ³ Ö #êd¥¿Ãy * ¿£'! @| Ÿ ÂÕ V¥<ŠÝ| ¥ŠÝ–+{ ²sTT
¿£'! ÔáT+ÔáÔáT¿£ –H • € , cÍ¼• eTqd¥y Ë <'#ãÅ£"
dËT ãy] Ð bõ+~¿Å£¢ ÿ ãÜ•+# * ÔáÏŸ € | ¼¢T, ý² q\ T>T] ý Ë

సిగ్గుపడేట్టు, అవమానం పాలయేట్టు ప్రవర్తించడం మీకు తగదు అంటోంది దేవేరి అలమేలు మంగమ్మ.

హవ్వ! పాపం ఆ యువతి సిగ్గుతో వక్షస్థలం దాచుకోడానికి ప్రయత్నిస్తుంటే తమరు ఆమె కుచముల వైపే మాటి మాటికీ తొంగి తొంగి చూడడం సరయిన కార్యమేనా? చెప్పండి! మీరు చేసే శృంగార చేష్టలకు ఆమె సిగ్గుతో నావేపు చూడవద్దు ఒట్టు సుమా ! అనేంతగా ఆమెను భయపెట్టేసారు. ఇవన్నీ ఆజవ్వని భరించలేకపోతోంది అన్న విషయం తమరు గ్రహించరా నాధా! ఎంత విరహం అయితే మాత్రం అని అడుగుతోంది.

అభిమానంతో, సిగ్గుతో ఆ యువతి తల వంచుకుని కూర్చుంటే..మీరు ఆవిడ కొప్పు లాగి చెక్కిలి నొక్కుతారా? నీ కపటపు పనులకు ఆపూబోణి తమరిని సిగ్గుతో, భయంతో ఎంత ఈసడించుకుంటుందో అన్న అలోచన తమరికి ఉండదా స్వామీ! ఎందుకు అంత త్వరపడతారు? స్త్రీ మనసెరిగి ప్రవర్తించాలన్న విషయం తమకు తెలియనిది కాదు కదా నాధా!

ఉత్సాహముతో చతురతగల స్త్రీ పడకగదిలో ఉండగా, రాజసంతో వచ్చి పచ్చి రతుల గూడేవు. వింత వింత అలంకారలతో శోభించే వేంకటేశ్వరా!... స్వామీ! తమరు మన్నించినట్లైతే బింకముతో ఉన్న ఆ జవ్వని ఎంత సంతసిస్తుందో కదా!

**విశేషాంశాలు:** తాళ్ళపాక కవులను చదివితే తెలుగు సంపూర్తిగా వస్తుందని వేటూరి ప్రభాకర శాస్త్రి గారన్న మాట అక్షర సత్యం. ఇందులో ఆనాడు వాడుకలో ఉండి నేడు మరుగున పడ్డ తెలుగు పదాలు ఎన్ని ఉన్నాయో చూసారా?

**అర్థములు:** మచ్చిక = మోహము, ఆసక్తి. మఱగు మొఱగు = చాటు మాటు అనే అర్థంలో ఆకాలపు జంట పదం, ఒనరు, ఒనయు = పొందిక, వీలు, వాటము. జవరాలు = యౌవనస్త్రీ. చిట్టకములు = శృంగార చేష్టలు. సిబ్బితి = సిగ్గుగల ఆడది. జంకు = భయము. వాసి = అభిమానము. d d Ÿ ≡ Ů R n ¿ ĦÔá T# ă ¢# ÃĦû¿ ≡ Ů. u ď Ÿ É øR మోసం, కపటం. తమకించు = త్వరపడు. ఓజ = ఉత్సాహము. చదురాలు = చతురతగల స్త్రీ. వోవరి = పడక గది, పచ్చిదేర = పచ్చిగా. తేకువ = జంకు, బింకం. సాజపు = అలంకరణతో యున్న.

–000–

## పద్మిని, చిత్తిణి, శంఖిణి, హస్తిణి

శరీర ఆకృతిని బట్టి స్త్రీలలో పద్మినీ, చిత్తిణి, శంఖిణి, హస్తిణి అను జాతులున్నాయని వాత్సాయనమహర్షి, అలాగే అనంగరంగలో కల్యాణమల్లుడు కూడా తెలియజేశాడు. ఆ నలుగురు నాయికలను అన్నమయ్య ఒకే కీర్తనలో చెప్పడం విశేషం.

మొదట ఆ నాయికల లక్షణాలను తెలుసుకుందాం. పద్మినీ జాతి స్త్రీ సకల శుభ లక్షణాలతో అలరారుతుందని చెప్పారు. ఆ జాతి స్త్రీ శరీరం తామర మొగ్గలా సుతి మెత్తగా ఉంటుంది. శరీరము పద్మం వంటి సువాసన కలిగి ఉంటుంది. కళ్లు విశాలంగా వుండి తళ తళ మెరుస్తూ సుగంధం కలిగి వుంటాయి. నాసిక సంపెంగరేకు వలె వుంటుంది. పద్మినీ జాతి స్త్రీ మనస్సు పెద్దలయెడ, దేవతల పట్ల భక్తి తత్పరులతో నిండి వుంటుంది. సంగీత సాహిత్యాది కళలలో ఆమె రాణిస్తుంది. శాస్త్రాలు, పురాణ ఇతిహాసాలన్నా, రత్నాభరణాలన్నా మక్కువ చూపుతుంది. అసత్యాలాడదు, కోపమన్నది ఎరుగదు. తెల్లని వస్త్రాలు ఇష్టపడుతుంది.

రెండవ జాతి స్త్రీ చిత్తిణి. పద్మినీ జాతి స్త్రీ కంటే శుభ లక్షణాలు కొద్దిగా తక్కువైనప్పటికీ, అంద చందాలలో ఆమెకు ఏ మాత్రం తీసిపోదు. ఈ స్త్రీ నడక అందం చిందుతూ వుంతుంది. చకోర పక్షి వలె చక్కని పలుకులతో ఆకట్టుకుంటుంది. నాట్యం, సంగీతం, నృత్య క్రీడ వినోదాదులపై ఆసక్తి మెండు. కనులు స్థిరంగా నిలపలేదు. రంగురంగుల దుస్తులు ఇష్ట పడుతుంది. శరీరం సుగంధాన్ని వెదజల్లుతుంటుంది. పూలంటే మక్కువ చూపుతుంది. పద్మినీ జాతి స్త్రీ కంటే ఈమె ఒకింత తక్కువ అని శాస్త్రకారులు చెప్తారు.

స్త్రీలలో మూడవ జాతి స్త్రీ శంఖిణి. పద్మినీ జాతి స్త్రీ కంటే ఈమె లక్షణాలు తక్కువ తరగతిలోకి వస్తాయి. శంఖిణి జాతి స్త్రీల దేహం బలంగా వుంటుంది. వీరికి కోపం ఎక్కువ. పువ్వులంటే మక్కువ చూపుతారు. కంఠస్వరం కర్కశంగా వుంటుంది. కుటిల స్వభావంతో చెప్పుడు మాటలు వినడం పట్ల ఆసక్తి కనబరుస్తూ వుంటుంది. ఈ జాతి స్త్రీ వాగుడు కాయ. పరిమళ ద్రవ్యాలంటే అమితాసక్తి. భర్తపై ఎక్కువ అనురాగమే చూపుతుంది.

స్త్రీ జాతులలో కడపటిది హస్తిణి. ఈ జాతి స్త్రీలకు తిన్నగా నడవడం చేతకాదు. నల్లటి జుత్తు. కోపం మరీ ఎక్కువ. శరీరం నుంచి కొద్దిగా దుర్వాసన వస్తుంది. తిండిపోతు. స్థూలకాయం, ఖంగు మని మోగే కంఠ స్వరంతో వుండే ఈ జాతి స్త్రీలకు కపటం తెలియదు.

పైన వివరించిన వివిధ జాతుల స్త్రీల లక్షణాలు పరిశీలిస్తే పద్మినీ జాతి స్త్రీ ఉత్తమమైనదని, చిత్తిణి మధ్య రకం అని, శంఖిణి అధమం అని. హస్తిణి అధమాధమం అని తెలుస్తుంది. ఆ నాలుగు రకాల స్త్రీల యొక్క తీరు మనం ఇప్పుడు అన్నమయ్య రాసిన ఈ క్రింది కీర్తనలో చూద్దాం.

పల్లవి: కుందణంపు మై గొల్లెత తా-
నెందును బుట్టని యేతరి జాతి ||పల్లవి||

చ.1. కప్పులు దేరేటి కస్తూరి చంకల
కొప్పెర గుబ్బల గొల్లెత
చప్పుడు మట్టెల చల్లలమ్మెడిని
అప్పని ముందట హస్తిణిజాతి ||కుంద||

చ.2.దుంప వెంట్రుకల దొడ్డతురుముగల -
గుంపెన నడపుల గొల్లెత
జంపుల నటనల జల్లలమ్మెడిని
చెంపల చెమటల చిత్తిణిజాతి ||కుంద||
చ.3.వీపున నఖములు వెడవెడ నాటిన
కోపపు జూపుల గొల్లెత
చాపున కట్టిగ జల్లలమ్మెడిని
చాపేటి యెలుగున శంకిణిజాతి ||కుంద||
 చ.4.గారవమున వేంకటపతి కౌగిట
కూరిమి బాయని గొల్లెత
సారెకు నతనితో చల్లలమ్మెడిని
బారపుటలపుల పద్మిణిజాతి ||కుంద||
(రాగం: ఆహిరి, శృం.సం.సం.5, రాగి రేకు 16, కీ.సం.92)

బంగారు ఛాయలోనున్న ఆ గొల్లభామ తాను ఏ జాతిలోనూ పుట్టని గొప్ప అతిశయముగల స్వేచ్ఛా విహారిణి అయిన స్త్రీ అని అర్థము. వూహాసుందరి అని కూడా అనుకోవచ్చునని కొందరి భావన.

అన్నమయ్య ప్రథమంగా హస్తిణీ జాతి స్త్రీ గురించి వివరిస్తూ..పరిమళాలు వెదజల్లే కస్తూరి సువాసనలతో గూడిన బాహుమూలములున్న స్త్రీ మరియూ ఎత్తైన వక్ష సంపద యున్న గొల్లభామ చల్లలమ్ముతూ వెళ్తూ ఉంటే, కాలి మెట్టెలకున్న మువ్వలు ఘల్లుఘల్లు మని మోగుతున్నాయి. ఆమె ఎవరో కాదు వేంకటేశ్వరుని ముందరి హస్తిణీ జాతి స్త్రీ అని చెప్తున్నాడు.

ఆ తర్వాత చిత్తిణీ జాతి స్త్రీ గురించి చెప్తూ ఆ స్త్రీ తల వెంట్రుకలు దుంపలుగట్టి పెద్ద కొప్పుతో ఉన్నది. గొప్ప అట్టహాసంగా ఉన్న గొల్లభామ నడుస్తూ ఉంటే చెవులకున్న చెంప సరాలు నాట్యం చేస్తున్నాయట. అలాగే ఆ గొల్లభామ అక్కడ చల్లలు అమ్ముకుంటూ ఉండడం వల్ల పడిన శ్రమ ఫలితంగా ఆమె చెంపలపై చెమటలు కారుతూ ఉన్నాయి కనుక ఆమె ఎవరో కాదు చిత్తిణీ జాతి స్త్రీ అంటున్నాడు అన్నమయ్య.

శంఖిణీ జాతి గురించి చెప్తూ, ఈమెను చూడండి వీపున నఖక్షతములు వేయగల స్త్రీ అంటున్నాడు. ఆ గొల్లభామ ఎంత కోపంగా చూస్తోందో చూడండి. ఆమె చల్లలమ్మడానికి ఎంత పెద్ద గొంతుతో కేకలు పెడుతోందో చూశారా! ఈమె ఖచ్చితంగా శంఖిణీ జాతి స్త్రీ సుమా అంటున్నాడు.

చివరగా.. ఈ గొల్లభామను గమనించారా! ఈమె గౌరవ భావంతో.. వేంకటేశ్వరుని కౌగిలినుండి ఎన్నడూ విడవక, ఎనలేని వలపులను కురిపిస్తోంది. ఈమె ఎప్పుడు చల్లలమ్మబోయినా ఆ వేంకట రమణుడు తనతోనే ఉండాలని ఆశించే గొల్లెత. ఈమె ఎక్కువ భారాన్ని శ్రమను తట్టుకోలేదు ఆమె పద్మినీ జాతి స్త్రీకదా అంటున్నాడు.

**అర్థములు:** కుందణము = కుందనము, బంగారము, ఏతరి = అతిశయము, గర్వి, స్వేచ్ఛావిహారి, కప్పులు = ఏతమునకు రెండువైపులా కాళ్లుపెట్టుకొనుటకు అమర్చు పొడవైన పలకవంటి కొయ్యలు, ఇక్కడ రెండు బాహుమూలలు అనే అర్థంలో వాడి ఉండవచ్చు, కొప్పెర = ఉన్నతమైన, పెద్దదైన, పెద్ద పాత్ర, గుబ్బలు = వక్షములు, మట్టెలు = పెళ్లయిన

ఆడవారు కాలివేలికి ఉంచుకునే వెండి తొడుగులు, దొడ్డ = పెద్ద, గుంపెన = గంతు, విజృంభణము, అర్భాటము, జంపులు = చెంప సరులు, నఖములు = గోళ్ళు, చాపేటి యెలుగున = పెద్ద గొంతుతో అరవడం కూరిమి = స్నేహము, ప్రియము, వలపు, సారెకు = మాటిమాటికి.
**విశేషములు:** కుందణము పదములో "ణ" కార ప్రయోగం సమీప కన్నడ భాషా ప్రభావం కావచ్చునని ఆచార్య రవ్వా శ్రీహరిగారి అభిప్రాయము.

-000-

## కన్య

అలంకార శాస్త్ర ప్రామాణిక గ్రంథమైన సాహిత్య దర్పణంలో "కన్య" అనే నాయికను వర్ణిస్తూ "కన్యాత్వజాతోపయమా సలజ్జా యౌవనా" అన్నారు. అంటే వివాహము కానట్టియూ, లజ్జా యౌవనములు గలిగినది యగు స్త్రీని కన్య యనబడును అని అర్థం. మనం నాయకునికి ఏ లక్షణాలు ఆపాదించామో నాయికలకూ దాదాపు అవే లక్షణాలు అలంకార శాస్త్రంలో ఆపాదించారు. ప్రబంధ వ్యాపకత్వం, ప్రధాన ఫలభోక్తృత్వం, మహా కులీనతాదులు ఉభయులకూ సమానమే. "నాయికా ప్రతి పూర్వాసా ఉపపూర్వాను నాయికా" అన్నారు. అంటే నాయికలలో ప్రతినాయికలు, ఉపనాయికలు, అనునాయికలు కూడా ఉంటారని భోజుడు పేర్కొంటే.. నాయికా బేధాలు ముఖ్యంగా – అగ్ని సాక్షిగా వివాహమాడిన భార్యను "స్వీయ" అనీ, వివాహము కాని పడుచును "కన్య" అనీ, పరుని వివాహమాడిన స్త్రీని "పరకీయ లేక అన్య లేక అన్యోఢ" అనీ, సర్వ సాధారణ స్త్రీని "సామాన్య" అనీ, ఇంకా వయస్సు కౌశలన్ని బట్టి చూస్తే, శృంగారం పట్ల ప్రతికూలత చూపే స్త్రీని "ముగ్ధ" అంటారనీ, అలాగే "మధ్య, ప్రౌఢ" అనే బేధాలుంటాయని శాస్త్రకారులు చెప్పారు.

ఆలంకారికులు శృంగార నాయికా నాయక సమాగమనానికి విట, చేట, విదూషక, పీఠమర్ధ అనే నలుగురిని చెప్తారు. కానీ అన్నమయ్య ఆ విదూషకులకు బదులుగా తానే ఆ పని నిర్వహిస్తూ దూతికలను మాత్రమే కీర్తనల్లో పేర్కొనడం జరిగింది. "కన్య" అయిన నాయిక చెలికత్తెతో పలికే పలుకులు ఈ క్రింది కీర్తనలో తెలుసుకుందాం.

పల్లవి: ననిచి యీతనితోనే నగుత నుండెద గాక
చనవుగలిగినవెనక జరయదగునటవే. ॥పల్లవి॥
చ. 1. భావ మాతని మీద బాదు కొలిపిన వెనక
చేవదేరగ నలుగ జెల్లునటవే
కావరపు వలపు లొడిగట్టుకుండిన వెనక
వావాత మచ్చికలు వదలదగునటవే ॥ననిచి॥
చ. 2. మిగులనతనికి మోవి మీదుకట్టిన వెనక
జిగిమించి ఇకబలుక జెల్లునటవే
పగటుతో వయసు తనపాలబెట్టిన వెనక
మగిడి మొగమాట లటు మానదగునటవే ॥ననిచి॥
చ. 3. లవి భోగ మతనితో లంకె సేసిన వెనక
చెలిమి సేయక మరువ జెల్లునటవే
యెలమి శ్రీవేంకటేశుడింతలో ననుగూడె
వెలలేని తమకమిక విడవదగునటవే! ॥ననిచి॥

(రాగం: శ్రీరాగం, శృం.సం.సం 28, రాగి రేకు 1810, సం.54)

అన్నమయ్య పదాలలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, అలమేలు మంగమ్మ నాయిక. ఆమె "కన్య". అన్నమయ్య శృంగార రాయబారి, ఒక్కోసారి దూతిక పాత్రకూడా వహించడం చేస్తాడు. ఈ కీర్తనలో కన్య నాయకుని గూర్చి చెలికత్తెతో చెప్పడం విశేషం.

నాయిక అలమేలుమంగ కన్యా నాయికగా చెప్తోంది. "ఓ దూతికా...నాకు సిగ్గు, బిడియం చాలా ఎక్కువ ఆ విషయం నీకు తెలిసిందే కదా!. కొత్తవారితో అసలు మాట్లాడలేను సుమా! ఇక ఈ శ్రీనివాసునితో

నంటావా...కాస్తా చనువు..పరిచయం ఏర్పడింది కాబట్టి ప్రేమతో ఇతనితోనే కాస్తా ఎక్కువగా నవ్వుతూ ఉంటానంటూ... ఇది నిందించదగ్గ తప్పేమీ కాదు" అని చెప్తూ నే తనకు శ్రీనివాసునిపై ప్రేమ ఏర్పడిందన్న విషయం అన్యాపదేశంగా చెప్తోంది నాయిక.

నామనసు ఆతనిమీదనే నెలకొనింది. మా బంధం బలపడిన తర్వాత అలగడం, మాట్లాడకుండా ఉండడం తగదు కదా..దూతికా! నేను పొగరు, గర్వంతో ప్రవర్తించి, నాకు ఆయనపై గల ప్రేమను, మోహాన్ని పోగొట్టుకుని ఉండగలనా చెప్పు అని, నా పక్షాన న్యాయం ఉంది కదా.. చెప్పు.. .. చెప్పు.. అని నిలదీస్తోంది నాయిక చెలికత్తెను.

అతనిపై మరులుకొని, నా మోహాన్ని ఆతనికి ముడుపు కట్టిన తర్వాత, ఇలా కపటపు మాటలు మాట్లాడడం న్యాయమంటావా ! చెప్పు? నా వయసు యౌవనం నీదేనని బాహాటంగా ప్రకటించి చెప్పిన తర్వాత, మళ్ళీ సంకోచంతో, మోమాటంతో అవీ ఇవీ మాట్లాడడం తగునా? చెప్పు.. నేను చేసేదంతా న్యాయమే కదా అని చెలికత్తె ఒప్పుదల కోరుతోంది నాయిక.

గిల్లికజ్జాలాడుకుంటూ స్వామిపై నాకుగల బంధం లంకెవేసిందన్న విషయం ఎరుగుదువు కదా! ఇప్పుడు ఆతనితో చెలిమితో సరసన ఉండకపోవడం తగునా? ఆనందంతో, ఎంత వికాసంతో ఆ స్వామి నన్ను చేరిన విషయం నీకు తెలియనిదా చెప్పు? ఆ స్వామి అందించే ఇంత వెలకట్టలేని మోహాన్ని విడవడం నాకు సాధ్యమా? విడవగలనా? అని స్వామి పై తనకు గల అనురక్తిని "కన్య" నాయికగా అమ్మ అలమేలుమంగమ్మ వ్యక్తం చేస్తోంది.

**అర్థములు**: ననిచి = ఇష్టపడు, ప్రియమగు (ననుచు యొక్క రూపాంతరం), నగుత = నవ్వుట, జరయ = నిందించు, పాదుకొలుపు = నెలకొను, నిలుపు, చేవదేర = బలపడుట, కావరము = పొగరు, గర్వము, వావాత = నోరార మీదు కట్టిన = దేవునికి మ్రొక్కుకొని ముడుపుగట్టిన, జిగి = కాంతి, ప్రకాశము, పగటు = ప్రకటించు, మగిడి = పాములవాడు వూదు బూర (క్రియా విశేషణంగా వాడినట్లైతే మగిడి అనే పదానికి.. మరల, వెనుక అనే అర్థాలు ఉన్నవి) మొగమోటము = సంకోచము, లవి = గిల్లు, కోయు, పొందగలుగు, ఎలమి = సంతోషము, తృప్తి, ఆనందము, తమకము = మోహము.

-000-

## పరకీయ

దేవదేవుని గుణ నామ మహిమలను కీర్తిస్తూ ఆత్మ, పరమాత్మల సంబంధాలతో కీర్తిస్తూ రచించినవి "ఆధ్యాత్మిక కీర్తనలు" కాగా, వూహలతో కల్పించుకొని, చెలిగా, నాయకునిగా, నాయికగా భావించి తత్సంబంధంతో సేవిస్తూ కీర్తించేవి "శృంగార కీర్తనలు". సేవాసక్తి చనువుతో సఖ్యాసక్తి, తదనుగుణంగా వాత్సల్యాసక్తి తో గూడినవై, కాంతాసక్తిని బయల్పరుస్తాయి. కాంతాసక్తి అనగానే దాంపత్యధర్మాలు బహిర్గతమవుతాయి. అవి సేవ, సఖ్యం, వాత్సల్యం మేలు కలబోతగా సాక్షాత్కరిస్తాయి. "తదర్పితాఖిల చారస్సన్ కామ క్రోధమానాధికం తస్మిన్నేవ కరణీయం" అని నారద భక్తి సూత్రాలలో చెప్పబడింది. అంటే పరమాత్మునికే సర్వమూ అర్పించి, కామ, క్రోధ అభిమానాదులన్నీ ఆ భగవంతునియందే వుండాలని చెప్పాడు. గోదాదేవి, నందవ్రజ గోపికా బృందం, తరించిన రీతిలో అన్నమయ్య అన్నీ ఆ ఏడుకొండల వానికే సర్వసమర్పణ చేశాడు. దాసాను దాసునిగా సేవిస్తానని సెలవిచ్చాడు.

అతను వర్ణించిన నాయికలలో "పరకీయ" లేక "అన్యోఢ" లేక "అన్య"ను గురించిన విశేషాలు విందాం. సాహిత్య దర్పణములో అన్యను గూర్చి "యాత్రాది నిరతన్యోఢా కులటా గళితత్రపా" అన్నారు. అలంకార శాస్త్రాలలో యేదో నెపముతో అటునిటు తిరుగుట, కిటికీలనుండి తొంగిచూచుట మొదలైన పనులనుచేసే స్త్రీగా వర్ణిస్తారు పరకీయను. అన్నమయ్యకు శాస్త్రం అన్న తర్వాత అన్ని తరహాల నాయికలనూ వర్ణించవలసిన అవసరం ఉంది గనుక వారి గుణగణాలతో

సంబంధంలేకుండా ప్రతినాయికనూ, ఎక్కడా దేవ, దేవేరులకు అపకీర్తి రాకుండా నిలిపిన తీరు అద్భుతం. ఈ కీర్తనలో ఓ పరకీయ స్వామితో పలికే పలుకులు విందాం. ఆ లోక సుందరునే మదినంతా నింపుకున్న ప్రణయనాయిక స్వామితో ఇలా అంటోంది.

పల్లవి: అంతచక్కనివాడవు అన్నిటా జాణవు నీవు
సంతోసాన నుప్పంగీ సారెకు నామనసు ॥పల్లవి॥
చ. 1. సొలసి నిన్నొకమారు పూచి తప్పక చూచితే
వలవక వుండుదురా వనితలు
నిలువున నెప్పుడైనా నీరూపు దలచుకొంటే
వులివచ్చి చెమటల నోలలాడకుందురా ॥అంత॥
చ. 2. సముకాన నీతోను సంగాతాలు సేసితే
తమకించకుండుదురా తరుణులు
జమళి మేనులు సోక సరసము లాడితేను
మమతల నిన్ను నిట్టె మరగక వుండుదురా ॥అంత॥
చ. 3. యీదుజోడై నిన్నుగూడి యెడవాయ కుండితే
వేడుక జొక్కకుందురా వెలదులు
యీడనే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యేడవారూ నీపొందుల కేకరకవుందురా ॥అంత॥

(రాగం: సాళంగం, శృం.సం.సం 28, రాగి రేకు 1826, కీ.సం.146)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక పరకీయ. నాయకుని గూర్చి మాట్లాడుతూ "స్వామి వారు నిన్నొక్క సారి చూస్తేనే

చాలు, మీ మనోహరరూపం దర్శించగానే వారు తమకించి పోతారు అంటూ స్వామి శృంగారాదులను వివరించి చెప్పడం విశేషం.

స్వామీ! ఎంత ముగ్ధమనోహర రూపం మీది. పైగా అన్నింటా నేర్పరివి, రసికుడవు. నిన్ను చూస్తే చాలు నాకు మళ్ళీ మళ్ళీ సర్వదా మనసు ఉప్పొంగిపోతూ ఉంటుంది. ఈ వాక్యాన్నే మనం ఆధ్యాత్మిక కోణంలో దర్శించితే “శ్రీవేంకటేశ్వరా! నీ దివ్యసుందర రూపం చూసి యెందరు ఋషులు, మునులు తరించలేదు. నీ రూపు మాకు ఎప్పటికీ ఎన్ని సార్లు చూసినా తనివి తీరదు” అని కూడా తీసుకోవచ్చు.

స్వామీ! అతిశయంతో మిమ్ములను ఒక్కసారి దరిజేరి చూసినట్లయితే నిన్ను వనితలు ప్రేమించక విడిచిపెడతారా? ఏ స్త్రీ అయినా నీ రూపు ఒక్కసారి తలుచుకుంటే చాలు. మన్మథ తాపంతో వెంటనే మేని చమటలతో తడిసి పులకించకుండా ఉంటారా? అని పరకీయ ప్రశ్నిస్తోంది స్వామిని. అలాంటి మన్మథ స్వరూపం మీది అని ద్వాపరయుగంలోని రాధను, గొల్లెతలను కూడా గుర్తుకు తెస్తున్నది నాయిక.

స్వామీ! దివ్యమనోహరా! నీ దరిజేరి నీతో చెలిమిజేసినట్లయితే, ఆ తరుణీమణులు త్వరపడి మోహముతో పులకించి పోకుండా ఉండగలరా? ఇక జంట శరీరాలుతాకి సరసాలాడినట్లైతే ఇంకేమైనా ఉందా! ప్రేమమోహాలతో నిన్ను విడిచి పెడతారా? నీతో కూడక యుండగలరా?

వారు మిమ్ములను ఈడూ జోడుగా దరిజేరి విడిపోకుండా వున్నట్లలైతే, మిక్కిలి పారవశ్యం పొందకుండా వుండగలరా? శ్రీవేంకటేశ్వరా! ఎక్కడివారైనా, ఎవరైనా సరే నీ పొందుకై అపేక్షిస్తూనే ఉంటారు. నన్ను



మాత్రం ఇక్కడనే కరుణించావు. చాలు స్వామీ! అని నాయిక ముగించింది.

అన్నమయ్య కాలం నాటి ఎన్నో మాటలు ఈనాడు కనుమరుగయ్యాయి. నిఘంటువులకు సైతం అర్థాలు దొరకడంలేదు. విజ్ఞులు ఎక్కువ సందర్భానుసరంగా చెప్పడమే కనిపిస్తోంది. ఉలివచ్చి, సంగాతాలు, ఏకరక వంటి పదాలు ఆకోవలోవే. ఉలివచ్చి (ఉలింపచ్చి) అంటే కొంచెం పచ్చిగా అని. పచ్చిగా అనే మాట దైవపరంగా వాడవచ్చునా అంటే, సమకాలీన నుడికారాలు అన్నమయ్య వాడడంలో దోషం ఏమీ లేదు. "సాధ్వీనైజ విభుం యధా ప్రాప్నోతి తధా పశుపతే:" అని శంకర భగవత్పాదులవారు శివానందలహరి లో సెలవిచ్చినట్లు ఒక పుణ్య స్త్రీ తన భర్త సాంగత్యాన్ని ఎలా కోరుకుంటుందో అలాగే భక్తుడు భగవత్సాన్నిధ్యాన్ని కోరుకోవడం సహజం. నవవిధ భక్తి మార్గాలన్నీ భగవంతుని చేరడానికే అని భాగవత కర్త సెలవివ్వడం తెలిసినదే కదా!

**అర్థాలు:** జాణ = నేర్పరి, రసికుడు (జాణకాదవు అని పురుషులకు జాణ అని స్త్రీలకు ఉపయోగించడం సముచితం) సారె = మాటి మాటికి, సొలసి = అతిశయించు, ఉలివచ్చి = కొంచెం పచ్చిగా, సంగాతాలు = స్నేహాలు, జమళి = జంట, సోక = తాక, ఎడవాయకుండు = విడిపోక ఉండడం, చొక్కకుందురా = పారవశ్యం, మత్తు, మైకం పొందకుండా ఉంటారా, యేకరక =మిక్కిలి అపేక్షగా.

-000-

## ముగ్ధ

ముగ్ధ నాయిక గురించి అన్నమయ్య చెప్పిన చక్కని కీర్తన గురించి తెలుసుకుందాం. ముగ్ధ అనగా ఉదయించుచున్న యౌవనముగలది. పం(డెండేండ్ల వయసుగల యువతి అని నిఘంటువులు చెప్తున్నాయి. రామరాజ భూషణుడు తన కావ్యాలంకార సం(గహం లో ఇలా నిర్వచించాడు.

శా. ఆలాపంబున కుత్తరంబొసగ దాయాసంబునంగాని, తా
నాలోకింపదు, పాటలాధరమరందాస్వాద సమ్మర్ధ ముం
దాళంజాలదు, కౌగిలీయదు, తనూ తాపంబు చల్లాఱగా
నేలజ్జావతి, త (ద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే?

అనగా అప్పుడే ఉదయించుచున్న యౌవనము గల స్త్రీకి బిడియము మొదలైనవి సహజంగానే ఉంటాయని చెప్పాడు. మనం భక్తి విషయానికి వస్తే... అన్నమయ్య ప్రతి పదమూ భక్తి రసస్ఫోరకమే అన్న విషయం తెలుస్తుంది. ఆది శంకరుల వారు వివేకచూడామణిలో "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అంటాడు. అన్నమయ్య తను సర్వం సహార్పణ గావించి సృష్టించిన అనంత సాహిత్య నిధి ఎన్ని వందల సంవత్సరాలైనా మనలను నిత్యనూతనంగా అలరిస్తూనే ఉంటుంది.

ముగ్ధ అయిన నాయిక నాయకునితో పలికే పలుకులు అన్నమయ్య బహుచిత్రంగా అభివర్ణిస్తాడు ఈ కీర్తనలో. సిగ్గులొలుకుతూ ముద్దు ముచ్చటలాడుతూ అమ్మ "చిత్తమెరుగక లోలో సిగ్గుతోడ నున్నదాన" అంటూ శ్రీనివాసునితో పలికే పలుకులు మనమూ విందాం.

పల్లవి: చిత్తమెఱగక లోలో సిగ్గుతోడ నున్నదాన
హత్తినాకు నన్నిటికీ నప్పణియ్యవయ్యా. ॥పల్లవి॥
చ.1 సందడించి నీతోను సరసములాడగాను
అందరిలో మందెమేళ మనవుగదా
చెందిన వూడిగాలు నీకు జెలరేగి సేయగాను
యెందుకో లాచీనని యెంచవు గదా ॥చిత్త॥
చ.2. గుట్టుతోడ నేపొద్దు కొలువులు సేయగాను
అట్టె వలపించవచ్చె ననవు గదా
చుట్టి చుట్టి నీతోను సుద్దులెల్లా జెప్పగాను
బట్టబయ లీతలని భావించవు గదా ॥చిత్త॥
చ.3. సరుస గూచుండి మోవిచవులు నిన్నడుగగా
అరుదంది ఆసకత్తె ననవు గదా
ఇరవై నన్ను శ్రీవేంకటేశ ఇట్టెకూడితివి
వొరసితే చన్నులకు నొడ్డించుకోవుగదా ॥చిత్త॥
(రాగం: దేశాక్షి, శృం.సం.సం 28, రాగి రేకు 1815, కీ.సం.83)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక ముగ్ధ నాయకుని గూర్చి మాట్లాడుతూ “స్వామీ మీ మనసు తెలియదు నాకు లోపల చాలా సిగ్గుగా ఉన్నదాన్ని. నేను మీ దరిజేరి చనువుతో ఏమైనా అన్నా, తెలీని కృత్యాలు చేసినా, నన్ను అన్యదా భావించవు గదా...నలుగురిలో నన్ను అపహాస్యంపాలు చేయవుగదా” అని అమాయకంగా నాయిక ముగ్ధ స్వామిని ప్రశ్నించడం ఈ కీర్తనలోని విశేషం. ముగ్ధ నాయికలకు అంతా

బిడియమే! అన్నీ అనుమానాలే! అని నిరూపిస్తూ అన్నమయ్య రాసిన చక్కని శృంగార సంకీర్తన.

నాయిక ముగ్ధ అమాయకురాలు. స్వామీ మీ మనసులో ఏముందో తెలీదు. నాకు మాత్రం లోపల లోపల చాలా సిగ్గు వేస్తోంది. నావిషయం కాస్తా పట్టించుకుని నాకు నీ సేవలకు, అనుమతినియ్యవయ్యా! అని అడగలేక అడగలేక మొహమాటంతో అడుగుతూ ప్రాధేయపడుతోంది.

స్వామీ! తొందరపడి నీతో సరసమాడినట్లైతే, నలుగురిలో నన్ను పరిహాసం చేయవు కదా! నీకు సేవ చేయాలన్న ఆతురతతో చేసిన పనులన్నిటినీ భారంగా ఎంచవు కదా!

స్వామీ! నీ సేవ చేసి తరిద్దామని నేను ప్రతిరోజూ చేసే కొలువును నిన్ను మోహింపజేయడానికి మాత్రమే వస్తున్నట్లు భావించవు కదా! నీ చుట్టూ తిరుగుతూ ఏవో నాలుగు మంచి మాటలు సరదాగా చెప్పడానికి యత్నిస్తే ఏమిటీ మాటలని ఎగతాళిగా మాట్లాడవు కదా!

స్వామీ! నీ వద్ద కూర్చున్న ఏకాంత సమయంలో నీతో తీయని అనుభూతులు కోరితే ఆశ్చర్యం వ్యక్తంచేస్తూ "ఆశ కత్తె"ను అనే ముద్ర వేయవు కదా! ఓ శ్రీవేంకటేశ్వరా! నెలకొని నాపై ప్రేమాతిశయం చూపిస్తూ ఉన్నావు, ఒక వేళ నీ కౌగిలి సుఖం కోరితే తప్పించుకొని పారిపోరు కదా! చెప్పండి! అని చమత్కరిస్తోంది అలమేలుమంగ.

**అర్థాలు:** చిత్తము = మనసు, హత్తి = అంటుకొని, పట్టించుకొని, అప్పణి = అనుమతి, సందడించి = తొందరపడి, అతిశయించి, మందెమేళ = చనువుతో ఆడు పరిహాసము, వూడిగము = సేవ,

లాచు = పొందు, లాచి = భారము, పొద్దు కొలువు = దినదినము చేసే సేవలు, సుద్దులు = మంచి మాటలు, అరుదంది = ఆశ్చర్యపడి, ఇరవై = నెలకొని, వొరసితే = రాచుకున్నట్లైతే, ఒడ్డించు = తప్పుకొను.

**విశేషాలు:** అన్నమయ్య కొన్ని అరుదైన మాటలు, అంటే ఇప్పట్లో వాడుకలో లేని కొన్ని జాతీయాలు ఇందులో వాడినట్టు తోస్తున్నది. "అందరిలో మందెమేళ మనుట", "బట్టబయలీతలు" మొదలైనవి.

-000-

## మధ్య నాయిక

వయస్సును బట్టి కౌశలాన్ని ఆధారంగా చేసుకుని నాయికలలో ముగ్ధ, మధ్య, ప్రౌఢ అనే మూడు రకాల నాయికలలో తెలుసుకున్నాం. ఇక మనం మధ్య నాయిక నాయిక గురించి తెలుసుకుందాం. రామరాజ భూషణుడు తన సరసభూపాలీయములో మధ్య నాయికను వర్ణిస్తూ...

ఉ.మానితవైఖరిన్ మణిత మంత్రములం, గబరీ వినిర్గళ
త్సూనములం బ్రసూన శర సూరుని బూజలొనర్చి తా రతిన్
మానిని యొప్పెనప్పుడసమాన మనోంబుజ వీధి నాతనిన్
ధ్యానము సేయుకై వడి రతాంత నితాంత నిమీలితాక్షియై. అన్నాడు.

తన కొప్పునుండి జారుతున్న పుష్పమాలలతో, కోకిల కంఠధ్వనితోడను, మన్మధపూజ చేసి, వివశురాలై నాయకుడినే సదా ధ్యానం చేసే అవస్థను వర్ణిస్తాడు.

సాహిత్యదర్పణంలో మధ్య నాయికను వర్ణిస్తూ "మధ్యా విచిత్ర సురతా ప్రరూఢ స్మర యౌవనా, ఈషత్ప్రగల్భ వచనా మధ్యమ వ్రీడితా మతా." అంటే..విచిత్రమైన సంగమము, యెక్కువైన మదన తాపముగల, ప్రగల్భమైన వాక్కులు గలది, లజ్జ ఎక్కువగా గల స్త్రీ అని అర్థం.

ఇక అన్నమయ్య నాయిక "మధ్యమ" దాదాపు ఇవే లక్షణాలతో చెలికత్తెలతో విభుని గూర్చి తీసుకోవలసిన జాగ్రత్తలను వివరిస్తూ ఉంది. "నా విభునితో ఎకచెకాలాడ వద్దు సుమా! అలసి సొలసి వచ్చిన అతనికి జలకాలాడించండి మంచి విందు భోజనం పెట్టండి" అని చెలికత్తెలను వివిధ పనులకు పురమాయిస్తోంది. ఆ వింతలు విశేషాలు "వెంగెము లాడకురే విభునితోను" అనే చక్కని కీర్తనలో పరికిద్దాం.

పల్లవి: వెంగెము లాడకురే విభునితోను
సంగతితో నతని కిచ్చకురాల నేను. ||పల్లవి||
చ.1. అద్దమరేతిరి కాడ నాతడింటికి విచ్చేసె
గద్దెపీట వెట్టరే కాంతలాల
వొద్దికతో మాటలాడనోపు గడు నేరుపరి
సుద్దులెల్లా నడుగరే చుట్టపు వరుసను ||వెంగెము||
చ.2. అలసినచెమటతో నదె నిలుచున్నవాడు
జలకము వట్టరే సతులాల
నెలకొన్న కన్నులను నిద్దురదేరీ దనకు
లలి బానుపు వరచి లాలించరే ||వెంగెము||
చ.3. అందు నిందు దిరిగాడి ఆకలి గొన్నాడేమో
విందు వెట్టరే పతికి వెలదులాల
చెందె నన్ను నింతలోనె శ్రీవేంకటేశుడితడు
పొందు లిందరికీ జేసీ పొగడరే మీరు ||వెంగెము||
(రాగం: గౌళ, శృం.సం.సం 28, రాగి రేకు 1805, కీ.సం.29)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక మధ్య, నాయిక చెలికత్తెలతో నాయకుని గూర్చి మాట్లాడుతూ "అతనికిష్టురాలనైన నేను అతనికి ఏమైనా అపరాధం జరిగితే వూరుకోను జాగ్రత్త! మంచి ఆసనం మీద కూర్చోబెట్టండి. పన్నీట జలకాలాడించండి, చక్కటి విందు భోజనం పెట్టండి అని గబ గబా చెలికత్తెలకు పనులన్నీ పురమాయిస్తోంది.

ఓ చెలికత్తెలారా! నా విభునితో మీరు పొరబాటున కూడా వెక్కిరింపు మాటలు, ఎగతాళిమాటలు ఆడకండి. శ్రీహరికి తగిన యుక్తంగా..చాలా

ఇష్టురాలను నేను అని దేవేరి మరీ మరీ చెప్తోంది. మధ్య నాయిక సుగుణాలివే! నాయకుని కొరకు వివశులై సదా విభుడినే ధ్యానం చేస్తూ ఉంటారు. ఆయనకు ఎక్కడ అపకీర్తి అవుతుందో.. ఎక్కడ తనవల్ల పొరబాట్లు జరుగుతాయోనని పలు జాగ్రత్తలతో ఎదురు చూస్తూ ఉంటుంది.

ఎప్పుడో నడిరేయివేళ స్వామి ఇంటికి వస్తారు. పెద్దదైన ఎత్తైన పీటపై అశీనులను చేయండి. ప్రేమ అనురాగాలు తొణికిసలాడే విధంగా మాట్లాడండి. స్వామి చాలా నేర్పరి. బంధుత్వం నెరపుతూ మంచి మంచి మాటలతో స్వామిని విశేషాలన్నీ అడిగి నాకు వెంటనే చెప్పండి అని ఆజ్ఞాపిస్తోంది అమ్మ.

స్వామి అనేక పనుల వత్తిడిలో అలసి చెమటలతో నిలుచున్నాడు. ఆయనకు పన్నీటి జలకమాడించండి. కమల నేత్రుడైన నా స్వామి నిద్దుర కన్నులతో ఉంటాడు. చక్కటి సొగసైన పానుపు పరచి లాలించి, బుజ్జగించి నిద్రకు ఉపక్రమింపజేయండి. ఇలా స్వామికి ఎక్కడా ఏ సమస్యా రాకుండా ఏ సమయానికి కావలసిన విషయాలను ఆసమయానికి చేయమని ఆదుర్దాతో చెలికత్తెలకు చెప్తోంది.

స్వామి భక్తులకు వరాలివ్వడం, రక్షించడం అనే కార్యాలతో తిరిగి తిరిగి మంచి ఆకలి మీద ఉండి ఉండవచ్చు. ఓ లలనామణులాలా! నా స్వామికి మంచి పంచ బక్ష్య పరమాన్నాలతో విందుభోజనం పెట్టండి. శ్రీవేంకటేశ్వరుడు నన్ను అంతలోనే చేరదీస్తాడు సుమా! అందువల్ల మా ఇద్దరికీ పొందికజేసి స్తుతించండి మీరు అని అమ్మ చెప్తోంది.

**అర్థాలు:** వెంగెము = వ్యంగ్యమునకు వికృతి, వెక్కిరింత, సంగతి = తగిన, యుక్తమైన, అద్దమరేతిరి = నడి రేయి, అర్థరాత్రి, గద్దెపీట = పెద్దదైన, ఎత్తైన ఆసనం, సుద్దులు = మంచి మాటలు, జలకము = నీరు, లలి = సొగసైన, ఒప్పిదమైన, లాలించు = బుజ్జగించటం, వెలది = స్త్రీ, పొగడు = స్తుతించు, సేవ.

-000-

## ప్రౌఢ

నాయికలలో వయస్సును, కౌశలాన్ని బట్టి "ప్రౌఢ" అనే నాయికను సాహిత్య దర్పణము "స్మరాంధా గాఢ తారుణ్యా సమస్త రతికోవిదా/ భావోన్నతాదరవ్రీడా ప్రగల్భా క్రాంత నాయకా" అని పరిచయం జేస్తుంది. అనగా స్మరాంధురాలు, సంపూర్ణ యౌవనము గలది, శృంగారచేష్టలు గలది, కొంచెం సిగ్గు గలిగి నాయకుని వశపరచుకొన్న స్త్రీ అని అర్థము. ప్రౌఢకు ప్రగల్భ అని నామాంతరము గలదు.

ఒక ప్రౌఢ నాయికతో చెలికత్తెలు ఈ క్రింది కీర్తనలో ఎలా మేలమాడుచున్నారో గమనించండి. ఎంత మనసెరిగిన నాయికవైనా ఇంత అతిచనువు పనికిరాదు నీకు, ఆ కుప్పిగంతులేమిటి? ఆ మొరటుదనంతో ప్రవర్తించడమేటి? హవ్వ ! ఇది నీకు తగునా? అని చనువుగా అమ్మను మందలిస్తున్నారు.

పల్లవి: ఇల్లాలికి దగునటే యింత రట్టడితనము
వొల్లనే మితిమేరతో నొనగూడవలదా ||పల్లవి||

చ. 1. రవ్వలుగా నవ్వేవు రతికిట్టె లాచేవు
చివ్వన పతిముందర సిగ్గువడవు
వువ్విళ్లూర జన్నులను వూదేవాతని వీపున
ఇవ్వల గొంచించవు యెంత మందెమేళమే ||ఇల్లాలి||

చ. 2. తప్పక మోము చూచేవు తగన మాటాడేవు
కుప్పళించేవు మోహము గుట్టెరగవు
ముప్పిరి నేడనైనాను మోవితేనె లడిగేవు
చెప్పరాదే వెరగయ్యా చెల్లబో నీ పగటు ||ఇల్లాలి||

ச.3. తోక్కే వాతని పాదము దోమటికి బెనగేవు
తక్క వాతని ఘనత దలచుకోవు
యిక్కడ శ్రీవేంకటేశు డీతడే నన్ను నేలె
చక్క జూడవే నీవు జాణవౌదు విపుడు ॥ఇల్లాలి॥

(రాగం: గౌళ, శృం.సం.సం 28, రాగి రేకు 1818, కీ.సం. 103)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, ప్రౌఢ నాయిక పద్మావతీదేవితో చెలికత్తెలు, అమ్మ యొక్క దుందుడుకు చేష్టలను గూర్చి విమర్శిస్తూ "ఇల్లాలికి ఇలాంటి అల్లరిదనం పనికిరాదు సుమా!" అని మెత్తగా సుద్దులు చెప్తున్నారు.

ఓ తల్లీ పద్మావతీదేవీ! నీ దూకుడు తగ్గించుకొనాలి ఇంత అల్లరి తనం పనికిరాదు నీకు. ఇంత తొందరపాటు తనం పనికిరాదు. ఏ పనికైనా హద్దూ ఆపూ ఉండాలి కదా! అని స్వతంత్రించి చెలికత్తెలు అమ్మకు నచ్చజెపుతున్నారు.

అపకీర్తి తెచ్చే విధంగా ఉన్నది నీ హాస్యం. స్వామిని పొందేటందుకు ఇంత తొందరా? స్వామి ముందు అసలు సిగ్గుపడవేల? నీ తహతహ తొందరపాటులతో వక్షోజాలతో స్వామి వీపుపై రుద్దుతున్నావు. ఏమాత్రం దేనికీ సంకోచించవు. ఇంత అతిచనువు నీకు తగదు తల్లీ... ఆలోచించుకో మరి అంటున్నారు.

స్వామిని చూస్తూ అసక్తతతో మాట్లాడుతున్నావు. మోహముతో క్రిందుమీదు గానక కుప్పిగంతులు వేస్తున్నావు. సమయం సందర్భం లేకుండా..వేళా పాళా లేకుండా స్వామిని అధరామృతం ఇమ్మని

అడుగుతునావు. ఆశ్చర్యంతో నిశ్చేష్టులమై పరికిస్తున్నాము నీ విధానం అంతా. ఇది సబబేనా? అని ప్రశ్నిస్తున్నారు.

ఎవరూ గమనించరనుకొని మొరటుగా అతని పాదాలు తొక్కుతున్నావు. అంతే తప్ప ఆతని గొప్పదనం తెలుసుకోలేకపోతున్నావు. శ్రీవేంకటేశ్వరుడు నిన్ను చేపడతాడు. చక్కగా అన్నీ గమనిస్తే నీవు జాణవు నేర్పరి అవుతావు సుమా! అని మేలమాడుతున్నారు ప్రౌఢ నాయికతో చెలికత్తెలు.

**అర్థాలు:** రట్టడి = అల్లరి, మితిమేర = అవధి, హద్దు, ఒనగూడు = కలియు, నెరవేరు, రవ్వ = అపకీర్తి, లాచు = కోరు, చివ్వన = తొందరగా, వూదు = ఒత్తు, నొక్కు, కొంచించు = సంకోచించు, భయపడు, మందెమేళ = అతి చనువు ప్రదర్శించడం, జంకు లేకపోవడం, కుప్పళించు = ఎగురు, దుముకు, కుప్పిగంతులు వేయు, మోవితేనె = అధరామృతము, వెరగు = నిశ్చేష్టత, చెల్లబో = ఆశ్చర్యము, పగటు = విధము, దోమటి = మొరటుతనము, తక్క = మోసము, జాణ = నేర్పరి, రసికురాలు.

-000-

## అష్టవిధ నాయికలు

అష్టవిధ నాయికల ప్రస్తావన మొట్టమొదట క్రీ.పూ. 2వ శతాబ్దంలో భరతముని సంస్కృతంలో రచించిన నాట్య శాస్త్రంలో పేర్కొనబడినది. ఆ తర్వాయి రచనలైన దశరూపకం (10వ శతాబ్దం) లోనూ, సాహిత్య దర్పణం (14వ శతాబ్దం) లోనూ ఈ నాయికల వర్ణన ఉంది. అలాగే జయదేవుడు (12వ శతాబ్దం) రచించిన గీత గోవిందంలోను, కేశవదాసు హిందీలో రచించిన రసికప్రియలో (16వ శతాబ్దం) మరియు వైష్ణవ కవి వనమాలి రచనలలో రాధ వివిధ నాయికల భూమిక పోషణలో, నాయకుడిగా శ్రీకృష్ణుడు కీర్తించబడ్డారు. 16వ శతాబ్దిలో జీవించిన కందుకూరి రుద్రకవి అష్టవిధ నాయికలను వర్ణిస్తూ జనార్ధనాష్టకం రచించాడు. ఈయన అష్టదిగ్గజ కవుల్లో ఒకడనే వాదన కవిలోకంలో ఉంది. అష్టవిధ నాయికలు కేవలం రచనల్లోనే కాక చిత్రకళ, శిల్పకళ మరియు శాస్త్రీయ నృత్య సాంప్రదాయాలలో తెలుపబడ్డాయి. మధ్యయుగపు చిత్రకళాఖండాలైన రాగమాల చిత్రాలు అష్టవిధ నాయికలను ప్రముఖంగా చిత్రించాయి.

అన్నమయ్య రచించిన శృంగార కీర్తనల్లో ఈ నాయికల విశేష వర్ణన ఉంది. అన్నమయ్యకు ఈ ప్రేరణ వైష్ణవ భక్తి నుండి సంక్రమించినదని భావించవచ్చు. ఘనవిష్ణువనే యతి అన్నమయ్యకు పంచసంస్కారాలు గావించి వైష్ణవ భక్తిని పాదుచేయగా, అహోబల మఠస్థాపకుడైన ఆదివన్ శఠగోపయతి వద్ద ఆయన పట్టుగ అభ్యసించిన శ్రీవైష్ణవ వేదాంత పద్ధతి ననుసరించీ, శ్రీవైష్ణవ మతమునకు చెందిన పంద్రెండుమంది ఆళ్వార్ల యొక్క "నాలాయిర దివ్య ప్రబంధము"లో నున్న నాయికా భావనకు అగ్రస్థానం ఇవ్వడం జరిగింది. గురువుల యొద్ద నేర్చిన వేదాంతము,

ఆళ్వారుల చరిత్రలు, భాగవత, విష్ణుపురాణములలో, నారద, శాండిల్యాది భక్తి సూత్రములలోనూ వివరింపబడిన గోపికాభక్తియే అన్నమయ్య శృంగార సంకీర్తనా రచనకు ప్రేరణ కావచ్చు. తన నొక నాయికగా భావించుకొని, స్వామిని నాయకునిగా మనసున నిలుపుకొని అన్నమయ్య తాను పురుషుడు, సంసారి అయిన తాను అసలు పుంసత్వమే లేనట్లు, ఆడుదనమే తనలో నిండుకొని ఉన్నట్లు భావించి, రసిక స్త్రీలకు కూడా మనసుకందని మనోభావాలను, శృంగార మర్మాలను విప్పి చెప్పడం దైవాంశ సంభూతుడైన అన్నమయ్యకు తప్ప అన్యులకు సాధ్యంకాదు.

ఈ అష్టవిధ నాయికలను వారి వారి మనఃప్రవృత్తిని బట్టి, శృంగార చేష్టలను బట్టి 1.స్వాధీనపతిక 2.వాసకసజ్జిక 3.విరహోత్కంఠిత 4.విప్రలబ్ధ 5.ఖండిత 6.కలహాంతరిత 7.ప్రోషితభర్తృక 8.అభిసారిక అనే పేర్లతో పిలుస్తారు.

రామరాజభూషణుడు రచించిన కావ్యాలకార సంగ్రహము (సరసభూపాలీయము) లో వీరి ప్రవృత్తుల గురించి ఓ చక్కని పద్యంలో వివరించడం జరిగింది.

సీ.వరుడు కైవసమైన వనిత స్వాధీనభ
ర్తృక ప్రియాగమ వేళ గృహము దనువు
సవరించు నింతి వాసక సజ్జ పతి రాక
తడవుండ నుత్కంఠ దాల్చు నింతి
విరహోత్క సంకేతమరసి నాధుడు లేమి
వెస నార్త యౌకాంత విప్రలబ్ధ
విభుడన్య సతిబొంది వేకువ రా గుందు
నబల ఖండిత యల్క నధిపు దెగడి

గీ. అనుశయము జెందు సతి కలహాంతరితని
జేశుడు విదేశ గతుడైన గృసత దాల్చు
నతివ ప్రోషిత పతిక కాంతాభిసరణ
శీల యభిసారి కాఖ్యయై చెలువు మెఱయు.

మరి అన్నమయ్య వీక్షించిన అష్టవిధ శృంగార నాయికల తీరు తెన్నులు ఎలాంటివో గమనిద్దాం.

**01. స్వాధీన పతిక**: పరస్త్రీలను గాంక్షింపక తనయందే అనురక్తుడైన పతి గల నాయిక. అన్నమయ్య స్వాధీనపతికగా ఒక శృంగార నాయికగా మారి తనదైన చమత్కార ధోరణిలో "ఏమందునే నేను యీతని తోడ వేమారు నన్ను లాలించి వేడుకొనీ దాను" (అ.శృంగా.సం.28-1832-183) అన్నాడు. ఒక నాయిక తన చెలికత్తెతో అనే మాటలు "చెలీ! ఏమని చెప్పమంటావే అతని శృంగార చేష్టలు. నన్ను ఎప్పుడూ లాలించి బుజ్జగించి వేడుకుంటూనే ఉంటాడు" అని అంటాడు.

అలాగే స్వాధీన పతిక చెలికత్తెలు కూడా ఆ నాయికను గూర్చి ఆమెతోనే ఏమంటున్నారో చూడండి. "ఏమి నోము నోచితివే యింతక తొల్లిబీ కామించ దగునే నీకు గక్కన నీ విభుడు" (అ.శృంగా.సం.28-1823-129) అనే కీర్తనలో చెలికత్తెలు ఆమెపై నాయకునికి గల అనురక్తికి నివ్వెరపోతున్నారు. "అమ్మా! నీ అందం అపురూపం కనుకనే నీ విభుడు నిన్ను విడువక నీ వెంటనే తిరుగుతున్నాడు".

అలాగే చెలికత్తెలు నాయకునితో కూడా అనే మాటలు చిత్తగిస్తే... "ఎంత బత్తిగలవాడ వీకె మీదను వింత మీ పొందులు చూచి వెరగయ్యా మాకును" (అ.శృంగా.సం.28-1838-220) "స్వామీ! ఎంత భక్తి

గలవాడవు మా అమ్మ అలిమేలుమంగమ్మ మీద మీకు. మీ శృంగార మాటలు చేతలు చూస్తూ ఉంటే మాకు ఆశ్చర్యం వేస్తున్నది " అని చమత్కరిస్తున్నారు శ్రీహరితో. ఇక్కడ భక్తి అన్నమాట సాధారణ భక్తిగా తీసుకోదగదు. స్నేహము, ఇష్టము అన్న అర్థంలో తీసుకొనాలి. ఆవిధంగా స్వాధీన పతిక నాయిక ద్వారా అన్నమయ్య శ్రీవేంకటేశ్వరునికి అమ్మపై గల ఇష్టాన్నీ, అనురక్తినీ తెలియజేస్తున్నాడు. "తమితో శ్రీవేంకటేశు తానె వచ్చి పెండ్లాడె!" అనే మాటల్లోనూ ఇదే అర్థం ఔచిత్యం ఉంది.

**2.వాసక సజ్జిక:** సుదీర్ఘ దూరప్రయాణం నుండి తిరిగివచ్చే ప్రియుని కోసం నిరీక్షించే నాయికగా ఈమెను సర్వము అలంకరించుకుని ప్రియుని రాకకై ఎదురుచూసే నాయికగా భావించవలెను. చిత్రకళలో ఈమెను పడకగదిలో పద్మాలు మరియు పూలదండలతో ఉన్నట్లు చూపిస్తారు. ఈమె అందాన్ని రతీదేవితో పోలుస్తారు. ఖజురహో లోని లక్ష్మణ దేవాలయంలోను ఈ తరహా విగ్రహాలను చూడవచ్చు.

అలాంటి వాసక సజ్జిక నాయకుని గూర్చి చెలికత్తెలతో ముచ్చటించే సందర్భంలో అన్నమయ్య "ఏమి సేసీనో విభుడు యెదురు చూచే నేను ప్రేమపు సంతోసాలు పెనగొనీ నాకును" (అ.శృంగా.సం.28-1824-138) అంటున్నాడు. నాయకుని కోసం ఎదురుచూపులు చూస్తూ... చెలులారా! అంటూ తన కంటున్న కలలను వివరిస్తోంది నాయిక. "స్వామి నాతో మాటాడినట్టే ఉంది, నాతో కలిసి నవ్వినట్టే ఉంది, పానుపు పై నాతో కలసినట్టే ఉంది కానీ ఏడీ! లేడే! కానీ ఆ స్వామి నన్ను వచ్చి యేలుకునే క్షణం వచ్చేసిందిలే" అంటొంది.

అలాగే చెలికత్తెలు నాయిక గురించి నాయకునితో పలికే పలుకులు బహు కమ్మగా ఉంటాయి. "రాపులు సేయక ఇక రావయ్యా! మాపుదాకా మాటలేల మరి ఇక రావయ్యా (అ.శృంగా.సం.28-1813-69) అంటున్నారు. "స్వామీ అమ్మను ఇంతకాలం ఎదురు చూపులు చూచేట్టు చేశావు ఇక చాలు. వచ్చి అమ్మను ఏలుకోండి. ఆమె మాచేత నీకు కబురంపింది. ఇక రండు" అంటున్నారు. అలాంటి వాసక సజ్జికను అన్నమయ్య పలు కీర్తనల్లో వివరించారు.

**3.విరహోత్కంఠిత:** విరహం వల్ల వేదనపడు నాయిక కనుక ఈమెకు విరహోత్కంఠిత అని పేరు వచ్చింది. ఈమె ప్రియుడు ఏ కారణంవల్లనైనా ఇంటికి రాలేకపోయినప్పుడు విరహంతో బాధపడుతూ నాయకుడిని గూర్చి పదే పదే చింతిస్తూ వరండాలో ఎదురు చూపులు చూస్తున్నట్లు చెప్పడం కద్దు.

అన్నమయ్య విరహోత్కంఠిత అయిన నాయకుని గురించి చెలికత్తెలు నాయిక విరహబాధను నాయకునికి విన్నవించే సన్నివేశంలో "ఎపుడు వత్తువోయనుచు యెదురు చూచీ జెలియ వుపమించి చెప్పితిమి వువిద జెందవయ్యా!" (అ.శృంగా.సం.28-1809-52) అంటున్నాడు. స్వామీ! నీకోసం అమ్మ కళ్ళు కాయలు గాచేలా యెదురు చూస్తున్నది. వెంటనే వెళ్ళి ఆమెను కలవండి. ఆమెను కలకాలం కరుణతో చూడండి అంటూ నాయిక బాధను నాయకుని వివరించే సన్నివేశం కదు సుందరంగా ఉంటుంది.

అలాగే నాయికే నాయకునితో తన విరహ బాధను తెలియజేసే సన్నివేశంలో "ఏమి సేతురా నా మనసు యెంతైనా బట్టగలేనుబీ కామించిన దాననై కడుగొసరే గాక" (అ.శృంగా.సం. 28–1885–496) అనే కీర్తనలో స్వామీ నేను ఏమి చేయగలను నా మనసును ఉగ్గబట్టలేకపోతున్నాను. నన్ను వివాహమాడి దూరంగా పెట్టడం న్యాయమా? నా సొమ్ము అనుకున్న నీవే యెడబాటైతే నేనేమి చేయాలి అంటూ ఒక విరహోత్కంఠిత అయిన నాయిక పడే బాధలను అతి మధురాతి మధురంగా వర్ణిస్తాడు.

**4.విప్రలబ్ధ:** ఈ శృంగార నాయికను ముందుగా నిర్ణయించుకున్న సంకేత స్థలానికి ప్రియుడు రానందుకు వ్యాకులపడే నాయికగా పిలుస్తారు. మోసగించబడ్డానని చింతిస్తూ రాత్రంతా ప్రియుని కోసం విలపిస్తూ వేచియుండే నాయిక. ఈ నాయిక ప్రియుడు నమ్మించి రానందుకు కోపగించి ఆభరణాలను విసిరివేస్తూ బాధపడే నాయికగా చిత్రీకరిస్తారు చిత్రకారులు.

అన్నమయ్య ఈ విప్రలబ్ధ నాయికను గూర్చి ఆమె పడే వేదన గురించి నాయకునికి చెప్పడం బాగా పండింది. "ఇన్నింటా సంతోసమాయ నిటు మిమ్మిద్దరి జూచి మన్నించి మన్ననలే మంతుకెక్కె నిపుడు" (అ.శృంగా.సం. 28–1817–92) అన్న కీర్తనలో స్వామిని రకరకాల వర్ణనలతో వర్ణిస్తూ..అమ్మ బాధను వివరిస్తూ నాయికనే వెంటనే కూడండి. విరహంతో కాగిపోతూ ఉన్నది అంటాడు.

అలాగే నాయిక నాయకునితో మాట్లాడుతున్న ఒక సంకీర్తనలో "నీ చిత్తమెట్టుండునో నీ నెరగ నాయకుడ యేచి నా సింగారమే ఇంత సేసె నన్నును" (అ.శృంగా.సం. 28–1891–535) అంటాడు. మంచి

సరసభాషణలతో నాయిక నాయకుని నీ మనసులో ఏమున్నదో నాకు తెలియదు నాయకుడా! అంటూ తనలో కలిగే వివిధ భావాలను కళ్ళకు కట్టినట్టు బొమ్మ కడతాడు విప్రలబ్ధను గూర్చి అన్నమయ్య.

**5. ఖండిత :** ప్రియుడు అన్య స్త్రీని పొంది ఇంటికి రాగా బాధతో క్రుంగునట్టి నాయిక. నమ్మించిన ప్రియుడు రాత్రంతా వేరొక స్త్రీతో గడిపి మరునాడు వచ్చినందుకు విపరీతమైన కోపంతోవున్న నాయిక. ఈమెను ప్రియునిపై తిరగబడుతున్నట్లుగా చిత్రీకరిస్తారు చిత్రకారులు.

ఒక ఖండిత యైన నాయిక చెలికత్తెతో పలికే పలుకులు ములుకుల్లా అన్నమయ్య కీర్తనలా చెప్తున్నాడు. "తానూ సవతినటా తారుకాణకేల వచ్చీబీ మానుమ నరే యెమ్మెలు మధిరాక్షులాల!" (అ.శృంగా.సం. 28-1819-196) అంటాడు. చెప్పుడు మాటలను విని తన్ను దూరం చేస్తున్నాడనీ, ఎవరినో పొందుతున్నాడన్న బాధ అడుగడుగునా వ్యక్తం చేస్తుంది నాయిక ఖండిత.

అలాగే ఖండిత అయిన నాయిక తనకు సపత్నిగా యున్న మరొక స్త్రీపై మాత్సర్యాన్ని ప్రదర్శించే సన్నివేశంలో అన్నమయ్య "ఇతడు నామగడౌట ఎరగవటే రతికెక్క జెనకేవు రమణుని నిపుడే" (అ.శృంగా. సం. 28-1819-91) అంటూ సపత్నుల పోరులో, తన మొగనిపై మరులుగొన్న స్త్రీని తూలనాడుతోంది నాయిక ఖండిత. నా మొగనికి కానుకలిచ్చీ, వగలు చూపి మీద మీద పడి నా విభుణ్ణి పొందాలని యత్నిస్తున్నావు. తగదు సుమా! అంటూ హెచ్చరిస్తోంది నాయిక.

**6. కలహాంతరిత:** కోపంతో ప్రియుని తూలనాడి, తర్వాత విపరీతంగా బాధపడే స్త్రీ ని కలహాంతరిత అని అంటారు. కోపంతో కలహించి లేదా ద్వేషంతో లేదా తనయొక్క చపలత్వంతో ప్రియుని వదిలిన నాయికగా అభివర్ణిస్తారు. ప్రియుడు గృహాన్ని విడిచిపోతున్నట్లుగా తర్వాత నాయిక అందులకు బాధపడుతున్నట్లుగా చిత్రకారులు చిత్రీకరిస్తూ ఉంటారు. కొన్ని సందర్భాలలో ఈమె ప్రియునికిచ్చిన మధువును తిరస్కరిస్తున్నట్లుగా చిత్రీకరణ జరిగింది. జయదేవుడు గీత గోవిందంలో రాధను కలహాంతరితగా వర్ణించాడు.

అన్నమయ్య కీర్తనల్లో నాయిక కలహాంతరిత నాయకునిపై కోపించి తర్వాత చింతిస్తూ చెలికత్తెతో నాయకునికి రాయబారం పంపుతూ పలికే పలుకులు బహు చిత్రంగా ఉంటాయి. ఉన్నపుడు కోపించి పరోక్షంలో అతని గూర్చి చేసే పొగడ్తలు సుందరంగా ఉంటాయి. "ఏమని చెప్పగవచ్చు నీతని ప్రతాపము/భూమిలో నారదులు పొగడేరీతనిని" (అ.శృంగా.సం. 28-1884-371) అంటూ ప్రియుని మళ్ళీ తన వశం చేసుకోడానికి చేసే ప్రయత్నం ఇది. దశావతారాలలోని నరసింహావతారాన్ని వర్ణిస్తూ "పిడుగులు రాలే పెద్ద స్థంభములోనుండి వచ్చి హిరణ్యకశిపుని చంపిన సింహము" అంటూ స్తుతిస్తూ నాయకుని పొగడే సన్నివేశం బావుంటుంది.

అలాగే కలహాంతరితయైన ఒక నాయికకు ఈ కోపతాపాలు చాలించుకోమని చేసే హితోపదేశం కూడా హృద్యమే! "ఇందరిముందర వలపేల దాచేవునీ/చందము లెఱుగుదురు నకులెల్లాను'' (అ.శృంగా.సం. 28-1831-177) అమ్మా! స్వామిపై వలపును ఎందుకు

దాచుకుంటావు? వెళ్ళి పన్నీటితో కాళ్ళు కడుగు, సిగ్గు పడకు స్వామిని కౌగిలింతలలో బంధించు" అని హితోపదేశాలు చేయడం అందంగా ఉంటుంది.

**7.ప్రోషితభర్తృక లేదా ప్రోషిత పతిక:** నాయకుడు దేశాంతరం వెళ్ళగా బాధపడే నాయిక". ఈమె భర్త కార్యార్థం దూరదేశాలకు వెళ్లగా సమయానికి రానందుకు చింతిస్తున్న నాయిక. చిత్రపటాలలో ఈ నాయికను చెలికత్తెలు పరామర్శిస్తున్నా దుఃఖంతో చింతిస్తున్నట్లుగా చిత్రిస్తారు.

ఒక ప్రొషిత భర్తృకయైన నాయిక చెలికత్తెతో తన నాయకునికి వర్తమానం పంపడం విశేషంగా వర్ణిస్తాడు అన్నమయ్య. "రమ్మనవే రమణుని రాపులు సేయగనేల/సమ్మతాయ బనులెల్లా జాగులిక నేటికి" (అ.శృంగా.సం. 28-1842-240) అంటూ సాగే ఈ కీర్తనలో స్వామిని త్వరగా వచ్చి తనను చేరమని స్వామితో తనకు ఉన్న అనుబంధాన్ని వర్ణిస్తుంది నాయిక.

ఒక ప్రొషిత భర్తృక యైన నాయికతో చెలికత్తె నాయకుని గురించి చెప్పే సన్నివేశం లో... "ఎట్టినోము నోచితివో, ఇదివో నీ భాగ్యము/ చుట్టరికము లెల్లాను చూపవమ్మా!" (అ.శృంగా.సం. 28-1815-81) అనే కీర్తనలో అమ్మా! స్వామికి ఎంత ఇష్టమో మీరంటే..మీ విషయాలే పదే పదే అడిగి తెలుసుకుంటారు.. ఇక వచ్చేస్తారులే! ఇక మీరు ఇష్టం వచ్చిన రీతిలో కబుర్లు చెప్పుకోవచ్చు అంటూ తమాషాగా మాట్లాడతారు చెలికత్తెలు.

**8.అభిసారిక లేక అభిసారిణి:** అభిసారం అనగా ప్రేమికులు తమ సంగమార్థం నిర్ణయం చేసుకునే సంకేతస్థలం. ప్రియుడి కోసం

సంకేతస్థలానికి పోయే నాయికను అభిసారికగా వర్ణిస్తారు కవులు. నియమాల్ని అతిక్రమించి ఇల్లు వదలి రహస్యంగా ప్రియుడ్ని కలవడానికి వెళుతున్న ఈ నాయిక ఇంటి ద్వారం దగ్గర లేదా త్రోవలో అన్ని అడ్డంకులను అతిక్రమిస్తున్నట్లు చిత్రిస్తారు. చిత్రకళలో అభిసారికను తొందరగా ప్రియున్ని కలవడానికి పోతున్నట్లు, మధ్యలో సర్పాలు, గాలివాన మొదలైనవి చూపిస్తారు.

అభిసారికయైన నాయికతో ఆమె చెలికత్తెలు పలికే పలుకులు వినండి. ''అమ్మరో! ఎంత సాహసివే నీవు/కమ్మర నాతడే నిను గరుణించీగాక!" (అ.శృంగా.సం.28-1822-124) అనే కీర్తనలో చెలికత్తెలు అమ్మను అభిసారికతో పోల్చుతూ అమ్మా ఎంత సాహసివమ్మా నీవు... ఎమాత్రం జంకూ గొంకూలేక అతనినే జంకేవిధంగా ప్రవర్తిస్తున్నావు అంటూ హాస్యమాడతారు. అలాగే ఒక అభిసారికయైన నాయిక చెలికత్తెలతో తన బాధలను చెప్పుకునే సన్నివేశం లో "ఏమీ తనకెంత చనవెన్నడూ లేమి/కామించి వచ్చీ వాపులు గలుపుకుంటాను" (అ.శృంగా.సం.28-1822-127) అంటూ స్వామి తనకెంత విధేయుడైన విభుడో సెలవిస్తుంది అమ్మ.

ఈ విధంగా అన్నమయ్య అష్టవిధనాయికలను బహుధా ఉల్లేఖిస్తూ అనేక వందల కీర్తనలను రచించారు. శృంగారాన్ని ఆలంకారికులు సంభోగ శృంగారమనీ, విప్రలంభ శృంగారమనీ రెండు రకాలుగా విభజించారు. నాయికా నాయకులు కలిసి ఉంటే అది సంభోగ శృంగారం, విడిపోతే అది విప్రలంభ శృంగారం. అన్నమయ్య సంకీర్తనలలో ఎక్కువ పాళ్ళు విప్రలంభ శృంగారమే! చివరి చరణంలో సంభోగం మాత్రం సూచన ప్రాయంగా

ఉంటుంది. నాయికను జీవిగా, ఆత్మగా, నాయకుడిని భగవంతునిగా, పరమాత్మగా భావించి రాసిన కీర్తనలన్నీ ఈ కోవలోవే! విప్రలంభ శృంగారంలోని, అభిలాష, ఈర్ష్య, విరహము, ప్రవాసం అనే బేధాలను గమనిస్తే అష్టవిధనాయికలలో అభిలాష అనే గుణం వాసక సజ్జిక, స్వాధీన పతిక, అభిసారికలలోను, ఖండిత, కలహాంతరితలలో ఈర్ష్య దర్శనమిస్తుంది. అలాగే విప్రలబ్ధ, విరహోత్కంఠితలలో విరహాన్నీ, ప్రవాసం విషయంలో ప్రోషిత భర్తృక ముఖ్య భూమిక వహిస్తారు. అయితే ఆయన అభిమానించి రసరమ్యంగా చిత్రీకరించిన నాయికలు ఇద్దరు. వారు ఖండిత, కలహాంతరిత అనే ప్రౌఢ నాయికలు. అన్నమయ్య ఎక్కువ శృంగార కీర్తనలు వారిమీదనే సాగాయి. అన్నమయ్య తాను నాయికగా, నాయకునిగా, చెలికత్తెలుగా, సపత్నులుగా రూపాంతరం చెంది అయా అవస్థలను అనుభవించి, పలవరించి కీర్తించాడు. వారి మనోభావాలను తాను స్వయంగా అనుభవించి రాసినవి. అన్నమయ్య శృంగారకీర్తనలు ఒక నూతన అలంకార శాస్త్రం. శ్రీవేంకటేశ్వరుని పై ఆయన వేసిన సమ్మోహనాస్త్రం. ఈ అష్టవిధ నాయికలను విడివిడిగా, ఒక్కొక్కరిని సమగ్రంగా విశ్లేషిద్దాం.

-000-

## స్వాధీనపతిక

అన్నమయ్య వీక్షించిన అష్టవిధ శృంగార నాయికలలో మొదటగా స్వాధీనపతిక నాయిక యొక్క మన:ప్రవృత్తిని బట్టి, శృంగార చేష్టలు, అవస్థలను బట్టి అన్నమయ్య కీర్తించిన విధానాన్ని ఈ క్రింది శృంగార కీర్తనలో చూద్దాం. పరస్త్రీలను గాంక్షింపక తనయందే అనురక్తుడైన పతి గల నాయిక ను స్వాధీన పతిక అంటారు. స్వాధీన పతికతో తోడి సతులు పలికే చమత్కారాలు ఈ కీర్తనలో చూద్దాం.

పల్లవి: చక్కని గుణవంతుడు సరి నీకు మగడాయ
యెక్కువైన నీభాగ్య మేమని చెప్పుదమే ||పల్లవి||
చ.1.నెలత నీనోములు నేడే ఫలియించె గదే
కలలు నీకిపుడె నిక్కలలాయెనే
పలికిన సగినాలు పతి వచ్చె గదవే
తలచగానే విభుడు తానే ఇందు వచ్చెను ||చక్కని||
చ.2.తొల్లిటి మీ పూజలు తుదకెక్కె గదవే
యెల్లగా నీకోరికలు యీడేరెనే
చెల్లుబడి నీ పంతము చేకూరె గదవే
యిల్లిదివో నీరమణు డెదుటనున్నాడు ||చక్కని||
చ.3. నీ వెంచిన యెన్నికలు నెరవేరె గదవే
కావలసినవి తారుకాణలాయెనే
దేవులవయితివి వావి దిష్టములాయ గదవే
శ్రీవేంకటేశుడు నిన్ను జేకూరినాడు ||చక్కని||
(రాగం: రామక్రియ, శృం.సం.సం 28, రాగి రేకు 1862, కీ.సం.361)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక స్వాధీనపతికయైన పద్మావతీదేవి, నాయికతో తోడి సతులు పలికే పలుకులు ఇవి.

పద్మావతీ! సుందరాంగుడైన శ్రీనివాసుడు నీకు భర్తగా లభించాడు. ఇంత సౌభాగ్యవతివైన నిన్ను నీ అదృష్టాన్ని ఏమని చెప్పగలం, పొగడగలం. అనగా నీకు అనుకూలుడైన భర్త లభించాడు. నీవు స్వాధీన పతికవే అని చెప్పడం.

పడతీ! నీవు నోచిన నోములన్నీ ఫలించి నీకు ఇంత అనుకూలుడైన భర్త లభించాడు. నీవు కలలనీ నేడు నిజమయ్యాయి. నీకు అన్నీ ఇక శుభ శకునాలే! నీవు మనసులో తలచుకుంటే చాలు పతి వచ్చి నీముందు వాలుతాడు.

నీవు ఆదినుండీ చేసిన పూజలూ వ్రతాలు గట్టెక్కాయి. నీకోరికలు సమస్తమూ సిద్ధించాయి. స్వామినే పొందాలనే నీకోరికా, పంతమూ నెగ్గాయి కదా! ఇదివో శ్రీనివాసుడు నీ ఎదుట నిలబడి ఉన్నాడు నీకోసం. అని అంటున్నారు తోడి సవతులు.

నీ కోరిక ప్రకారం నీవు యెంచుకున్న స్వామినే పొందగలిగావనడానికి కావలసిన తార్కాణాలు, ప్రమాణాలు అనేకం కనిపిస్తున్నాయి కదా! నీ ఇష్టప్రీతిగా మహారాణిగా చూడబడుతున్నావు. శ్రీవేంకటేశ్వరుడు నిన్ను యేరి కోరి జత గూడాడు అంటున్నారు.

**అర్థాలు:** సగినాలు = శకునాలు, తుదకెక్కె = గట్టెక్కె, యెల్ల = సమస్తము, చేకూడె = సిద్ధించె, తారుకాణాలు = తార్కాణాలు, ప్రమాణాలు, దృష్టాంతములు, దేవులవైతివి = మహారాజ్ఞీత్వం, రాణీవాసం, దిష్టము = చూడబడినవి.

## వాసక సజ్జిక

"ప్రియాగమనవేళాయాం మణ్డయన్తీ ముహుర్ముహుః/కేళీగృహం తథాత్మానం సా స్యాద్వాసకసజ్జికా" అని విద్యానాథుడు తన 'ప్రతాప రుద్రీయము'లో వాసకసజ్జిక యొక్క లక్షణాలను చెప్తాడు. వాసకం అంటే ఇల్లు, వస్త్రం, పరిమళం వెదజల్లే మూలిక / వేరు, సజ్జిక అంటే సిద్దంగా ఉండడం అందుకే వాసక సజ్జికకు ఆ పేరు. ఈ తరహా నాయిక ప్రియుడు లేక పతిరాక కోసం ఎదురుచూపులు చూస్తూ, ఏ క్షణమైనా రావచ్చునని తనను, తన పడకగదిని సుమనోహర, పరిమళ, సుగంధ భరితంగా అలంకరించుకొని తన పతికి కనువిందు చేయటానికి సిద్ధంగా ఉండే నాయిక. రకరకాల మణులు పొదిగిన బంగారు ప్రమిదల్లో సువాసన గల తైలం పోసి దివ్వెలను వెలిగించి, లేత తమలపాకులు, పోకచెక్కలు, పచ్చకర్పూరం, కుకుమపువ్వు, యాలకులు, లవంగాలు ఒక అందమైన పళ్ళెంలో సిద్ధం చేసుకుని ప్రియునికోసం యెదురు చూసే నాయిక. ఈమె అందంగా తయారై ప్రియుని రాకకోసం తద్వారా లభించే ఆనందాల కోసం నిరీక్షిస్తున్నట్లు గ్రంథాలలో చెప్తారు. ఈమె అందాన్ని కొన్ని సార్లు కవులు రతీదేవితో పోలుస్తారు. వాసకసజ్జికశిల్పం ఖజురహోలోని లక్ష్మణ దేవాలయంలోను మరియు జాతీయ సంగ్రహాలయాలలో కనిపిస్తాయి.

రామరాజభూషణుని 'ప్రియాగమవేళ గృహము, దనువు సవరించు నింతి వాసకసజ్జ' అన్న మాట సైతం పై విషయన్ని సమర్ధిస్తూ ఉన్నది కనుక యిదీ ప్రతాపరుద్రీయ సమభావనయే అనడం సత్య దూరం కాదు. 'వాసకం వాసస్థానం సజ్జయతీతి వాసకసజ్జా' అనియు, 'వాసకే సజ్జా కృతమండనా' అనియు వాసకసజ్జాపదమునకు గల వ్యుత్పత్తులు ఆవిధంగా లోకంలో మనకు సమకూరినవే! కాని 'స్త్రీణాం వారస్తు వాసకః ' అని కూడా ఉన్నది. 'స్త్రీని కలిసికొనుటకు పురుషుడేర్పరచుకొన్న వారము వాసకము' అని దీని కర్థము. ఇది ఈ ఆధునిక కాలంలో పాశ్చాత్య దేశాలలోనూ, ప్రస్తుతం మన దేశంలోనూ విస్తరిస్తున్న 'డేటింగ్' వంటిది అని అంటారు కొంతమంది. పూర్వకాలంలో గొప్పవారు, ధనవంతులకు బహుభార్యలుండడం ఆచారంగా వుండడం వలన వారిలో కొందరు స్త్రీలను పురుషులు కొన్ని కొన్ని నిర్ణీత సమయములలో/వారములలో కలుసుకొనే వారనీ అట్టి వారమే వాసకమనీ నానుడి ఉంది. ఆ వాసకమునందు అలంకరించుకొని సిద్ధముగా నుండు నాయిక 'వాసకసజ్జిక' అని ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాతలైన కుమారస్వామి ప్రభృతులు ఇంకో అర్థమును తెల్పినారు.

సర్వజ్ఞ సింగభూపాలుడు రసార్ణవసుధాకరములో ఈక్రింది శ్లోకమును వాసకసజ్జిక కుదాహరణముగా నిచ్చినాడు. "కేళీగేహం లలితశయనం భూషితం చాత్మదేహం/దర్శం దర్శం దయితపదవీం సాదరం వీక్షమాణా, కామక్రీడాం మనసి వివిధాం భావినీం కల్పయన్తీ/సారంగాక్షీ రణరణికయా నిఃశ్వసన్తీ సమాస్తే" అనగా ప్రియుడు తనగృహమునకు వచ్చు

వేళయైనది. ఆసమయమునకు నాయిక తన కేళీగృహమును, లలితమైన, అందమైన శయ్యను, తనను అలంకరించుకొని, మిక్కిలి ఆదరంతో, అనురాగంతో, మాటిమాటికి దారివేపు అతని రాకకై చూస్తూ, తద్వారా జరగబోయే వివిధకామక్రీడల భావనలను మనస్సులో పరి పరి ఊహిస్తూ, ఉత్కంఠతో ఉండిపోయిన నాయిక అని భావన.

ఈక్రింది పద్యంలో రామరాజభూషణుడు పురలక్ష్మికి వాసకసజ్జికాత్వము నాపాదిస్తూ తన కావ్యాలంకారసంగ్రహములో చక్కని ఉదాహరణము నిచ్చినాడు.

“యవన చమూ సమూహముల నాజి జయించి, యుదగ్రదిగ్జయో/త్సవవిభవాభిరాముడయి సారెకు నోబయనారసింహభూ/ధవు డరుదెంచులగ్నమున దత్పురలక్ష్మి విభూషితోల్లస/ద్భవన విశేషయై మృగమదద్రవవాసన దాల్చు నిచ్చలున్.” అనగా యవన సేనాసమూహములను యుద్ధములో జయించి, దిగ్విజయవిభూషణుడైన మహారాజు వచ్చు ముహూర్తమునకు ఆతని పురలక్ష్మి భవనముల నలంకరించుకొని, కస్తూరీసుగంధయుతయై ఉండెనని పురలక్ష్మికి రామరాజభూషణుడు వాసకసజ్జికాత్వము నాపాదించడం బహుధా హర్షణీయం. మంచి కవినమయం కూడా! ఈ విధమైన శృంగారనాయికాతత్త్వమును పురలక్ష్మికి ఆపాదించి పురలక్ష్మిని వాసకసజ్జిక గావించినాడు.

అన్నమయ్య వీక్షించిన అష్టవిధ శృంగార నాయిక వాసకసజ్జిక నాయిక యొక్క మనఃప్రవృత్తిని బట్టి, శృంగార చేష్టలు, అవస్థలను బట్టి

అన్నమయ్య కీర్తించిన విధానాన్ని ఈ క్రింది శృంగార కీర్తనలో చూద్దాం. వాసక సజ్జికతో తోడి సతులు పలికే చమత్కారాలు ఈ కీర్తనలో చూద్దాం.

పల్లవి: చూడరమ్మ ఇంతులాల సుదతి చందము నేడు
వేడుక సింగారాలు వింత వింతలాయను ॥పల్లవి॥

చ. 1. జక్కవ గుబ్బల మీది సరులు
వెక్కసపు గొప్పలోని విరులు
చెక్కుటద్దపు గాంతుల సిరులు
చక్కని యీకెకు నెన్ని సమకూడె గురులు ॥చూడరమ్మ॥

చ. 2. నిలువున నొయ్యారపు నీట్లు
వలపె పయ్యెద వల్లెవాట్లు
మలయు మోము సురటిమాట్లు
కుటుకునవ్వు లీకెకు గొండలు గోట్లు ॥చూడరమ్మ॥

చ. 3. కావరపు బిఱుదుల కలిమీ
భావములో వలపుల బలిమీ
శ్రీ వేంకటేశుడు గూడె జెలియలమేల్మంగను
చేవదేరె నీకెకు చెప్పరాని చెలిమీ ॥చూడరమ్మ॥

(రాగం: సామంతం, శృం.సం.సం 28, రాగి రేకు 1849, కీ.సం.285)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక వాసక సజ్జిక యైన పద్మావతీదేవి, నాయికతో తోడి చెలికత్తెలు పలికే పలుకులు ఇవి. అమ్మవారి అందచందాలను వర్ణిస్తూ తోడి చెలికత్తెలు ఏమంటున్నారో చూడండి. అమ్మలాలా! కొమ్మలాలా! చూశారా! ఈ దేవేరి ముఖ

కాంతులు...ఆ పద్ధతీను. అమ్మ బలీయమైన కోరికతో సింగారించుకొని ఎంత విలాసవంతంగా, కొత్త కొత్తగా ఉన్నదో! చూడండి.

చక్రవాకముల వంటి వక్షద్వయము తగినట్లు అందంగా అమరి ఉన్నవి. అమ్మ కొప్పులోని పుష్పాలను చూశారా ఎంత వింతశోభను గొలుపుతున్నాయో! అమ్మవారి చెక్కిళ్ళు అద్దపు కాంతులీనుతూ మెరుస్తున్నాయి కదా! ఇంత చక్కని అమ్మకు ఎన్ని చక్కని శోభలు అధికంగా సమకూరాయో చెప్ప శక్యం కావడంలేదని చెలికత్తెలు అమ్మ శోభను చూసి తరించి పోతున్నారు.

అమ్మవారి శరీరం గమనించారా! నిట్టనిలువుగా ఎత్తుగా శృంగార గర్వంతో అతిశయించి ఉన్నది. ఆమె ప్రేమనే పయ్యెదపై పవిట వల్లెవాటుగా ఉన్నది. ఆ మోము మాటి మాటికీ అటూ ఇటూ తిప్పుతూ వన్నెల విసనకర్ర లా తిరుగుతూ ఉన్నది. అమ్మ నోరు వంకరగా తమాషాగా ఎంత అందంగా ఎంత గొప్పగా పెట్టిందో చూశారా!

ఎత్తైన పిరుదులతో అంతరంగ తరంగాలలో స్వామివారిపై ప్రేమను కుమ్మరిస్తూ ఉన్న అమ్మవారిని శ్రీవేంకటేశ్వరుడు కలియబోతున్న, కూడబోతున్న సందర్భంలోని ఆనందం గమనించారా! ప్రేమలో ఆరితేరిన అమ్మవారికి స్వామినికూడేందుకు ఎంత ప్రేమ? వాసకసజ్జికలా అని చెలికత్తెలు మాట్లాడడంలో ఔచిత్యం ఉంది. ఆనందం ఉంది. అర్థం ఉంది. పరమార్థం ఉంది.

**అర్థాలు:** జక్కవ= చక్రవాకము, సరులు = సరిగా, తగినట్లుగా, వెక్కసము = అధికము, సిరులు = శోభలు, గురులు = అధికము, నిలువున =

ఎత్తుగా, నీటు = శృంగార గర్వం, వల్లెవాటు = పైట వలె కప్పుకొను వస్త్రము (నెల్లూరు చిత్తూరు జిల్లాలలోని మాట) మలయు = వ్యాపించు, తిరుగు, సురటి = విసనకఱ్ఱ, కుటుక = వంకర, కావరము = గర్వము, చేవదీరు = ఆరితేరు, సర్వము తెలిసికొన్న.

**విశేష పదప్రయోగం:** 1. "కుటుకునవ్వు లీకెకు గొండలు గోట్లు" అన్న వాక్యంలో కొండలు, గోట్లు అన్న పదప్రయోగములలో "కొండలు" అనగా "గొప్పదయిన" అని తీసుకొనబడినది. "గోట్లు" అన్న పదం వాడడంలో ఔచిత్యం కోట్లు లేక లెక్కకు మిక్కిలి అన్న అర్థం స్ఫురించుచున్నది.

2. అన్నమయ్య ఈ కీర్తనలో "జక్కవ గుబ్బలు" అనే వినూత్న పద ప్రయోగం గావించారు. దానిలోని అంతరార్థం బోధపడాలంటే మనకు చక్రవాక పక్షుల గురించి తెలియవలసి ఉంది. చక్రవాక పక్షులు ఎప్పుడూ జంటగానే ఉంటాయి. పక్క పక్కనే అన్నివేళలా. అందుకే చనుగవకు ఉపమానంగా "వక్షోజాల జంట" ను ఎంత అందంగా చక్రవాక పక్షుల జంటతో నిర్దేశించాడో చూడండి అన్నమయ్య.

## విరహోత్కంఠిత

విరహోత్కంఠిత అనగా విరహంవల్ల వేదన లేక బాధ పడు నాయిక అని అర్థం. ఈమె ప్రియుడు కారణాంతరాల వల్ల ఇంటికి సకాలంలో రాలేకపోయినప్పుడు విరహంతో బాధపడుతుంది. ఈమెను పానుపుమీద కూర్చున్నట్లు లేదా ఇంటి ముంగిలిలో ఎదురుచూపులు చూస్తూ నిలబడినట్లుగా చిత్రపటాలలో ఉంటుంది.

"అనాగసి ప్రియతమే చిరయత్యుత్సుకా తు యా విరహోత్కంఠితా భావవేదిభిః సా సమీరితా" అని విరహోత్కంఠితా లక్షణము గూర్చి "రసార్ణవసుధాకరము" లో ఉన్నది. 'పతిరాక తడవుండ నుత్కంఠ దాల్చునింతి విరహోత్క' యను నిర్వచనము గూడా చాలా దగ్గరగా యిదే అర్థం ఇస్తున్నది. ప్రియుడు ఎంతకాలమునకును రాకపోవుటచే వేచివేచి ఉత్కంఠాపూరితయై, అతని విరహమును సహింపలేనందువల్ల విరహోత్కంఠిత అవుతుంది. వాసక సజ్జికకూ, విరహోత్కంఠితకూ మనఃస్థితులలో కొంచెం స్వామ్యం ఉంది. చింత, నిశ్వాసము, ఖేదము, సఖీసంలాపము, గ్లాని, దైన్యము, అశ్రుపాతము, రోషము, భూషణత్యాగము, రోదనాదులతో విరహోత్కంఠిత తన యవస్థను అభినయించవలెనని భరతుడు తెల్పినాడు.

సంస్కృతములో అమరుకశతకము, పుష్పబాణవిలాసము, గీతగోవిందము మున్నగు ఉత్తమ ప్రణయేతివృత్త సమన్వితములగు గ్రంథములు ఈ శృంగార నాయికల అవస్థలను చక్కగా వర్ణించుచున్నవి. ఉదాహరణకు పుష్పబాణవిలాసములోని విరహోత్కంఠితవర్ణనను గమనిస్తే...."సాస్రే మాకురు లోచనే విగళతి న్యస్తం శలాక్షానం/ తీవ్రం నిశ్వసితం నివర్తయ నవా స్తామ్యన్తి కంఠస్రజః,/తల్పే మాలుఠ కోమలాంగి!తనుతాం హన్తారాగో శ్నుతే/ నాతీతో దయితోపయానసమయో మాస్మాన్యథా మన్యథాః" అని తెల్పినాడు.

భరతుడు చెప్పిన విరహోత్కంఠితా లక్షణములు ఈ శ్లోకములో చాలా బాగుగా ఉన్నవి. ఒక నాయిక ప్రియునికై వేచినది. కాని అతడెంతకును రాలేదు. అప్పుడామెకు అధికసంతాపము, తెలియని

కలవరము కలిగినవి. అందువల్ల నాయిక అశ్రునయనయై, నిట్టూర్పులను నిగిడించుచు తల్పమున బొరలసాగినది. ఇందులో సుకుమారి అనునది మంచి పదము. భరతుడు చెప్పిన విరహోత్కంఠితా లక్షణములు ఈ శ్లోకములో పుష్కలముగా నున్నవి.

మన అన్నమయ్య వర్ణించిన విరహోత్కంఠిత ఎలా ఉందో చూద్దాం.

పల్లవి: ఏమని విన్నవించేము ఇంతి చందములు నీకు
ఆముకొన్న కరుణతో నాదరింతు గాక ||పల్లవి||
చ. 1. వొప్పగు నిన్ను దలచి వువిద పాన్పు మీద
నుప్పతిల్లు జెమటల నోలలాడీని
ముప్పిరిగొన్నవయసు ముంచి యాసలు రేచగా
చెప్పరాని వలపుల జిమ్మిరేగీని ||ఏమని||
చ. 2. వొట్టిన నీగుణములు వొకటొకటే యెంచుక
అట్టె నిట్టూరూపుల నుయ్యాల లూగీని
గట్టిగా నీవిచ్చినవుంగరము చూచి చూచి
గుట్టుతో దమకముల గుబ్బతిలీని ||ఏమని||
చ. 3. గక్కన జెలులు నీకతలు చెప్పగా విని
వెక్కసపు బులకల విఱ్ఱవీగీని
యిక్కడ వచ్చి శ్రీవేంకటేశ యింతి గూడితివి
పిక్కటిల్లు సంతోసాల బెనగొనీని ||ఏమని||
(రాగము: ఆహిరి, 28-197 రాగిరేకు 1834)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక విరహోత్కంఠితయైన పద్మావతీదేవి, చెలికత్తెలు నాయికను గురించి నాయకునికి విన్నవించే సన్నివేశం.

శ్రీనివాసా! ఏమని విన్నవించుకోగలము ఆ పద్మావతీదేవి యొక్క పద్ధతులు మీకు. మీరే ఆమెను గాఢమైన కరుణాసముద్రుడవై ఆదరించవలసి యున్నది ప్రభూ.. అని వేడుకుంటున్నారు అమ్మ తరపున అయ్యను.

అందమైన ఆ అమ్మ నిన్ను పదే పదే తలుచుకుంటూ తాళలేని వేడికి చెమటలతో పానుపుమీద స్నానం చేసినదా అన్నట్టు ఉన్నది. అతిశయించిన ఆమె యొక్క వయసు తాపమువల్ల అనేక ఆశలు రేపుతూ ఉండగా మీపై అధికమైన వలపుతో ఎదురు చూస్తూ కాలం గడుపుతూ ఉన్నది.

అయ్యా! శ్రీహరీ! అమ్మ ఊరకే పదే పదే నీగుణగణాలను ఒకటొకటే చెప్పుకుంటూ, నిట్టూర్పులతో మనసు ఉయ్యాలలూగుతూ గడుపుతోంది. నీవు వేలికి పెట్టిన అంగుళీయకాన్ని పదే పదే చూసుకుంటూ అతిశయించిన ప్రేమతో గుట్టుగా ఎదురుచూపులు చూస్తోంది.

అప్పుడప్పుడూ మేము చెప్పే నీ లీలలు కథలూ వింటూ సంతోషం అధికమై ఆమె శరీరం ప్రేమ పులకరింపులతో అత్యుత్సాహంతో అధికమైన సంతోషాతిశయంతో ఎదురుచూపులు చూస్తోంది. స్వామీ నీవు వచ్చి అమ్మను చేపట్టినట్లైతే నిండిన సంతోషోత్సాహంతో మెలికలు దిరిగిపోవడం ఖాయం. రండి వచ్చి అమ్మను చేరండి అంటున్నారు చెలికత్తెలు. ఇక్కడ అన్నమయ్య ఉద్దేశ్యం చెలికత్తెల ముఖ్యోద్దేశం ఆ పద్మావతీ దేవి తమకంతో మోహంతో

ఎదురు చూస్తోంది వచ్చి చేరండి అని రాయబారం నెరపడమే!

**అర్థాలు:** ఆముకొను = గాఢమగు, ఒప్పగు = అతిశయించిన అందంతో, వువిద = స్త్రీ, ఉప్పతిల్లు = తాళలేని, ఓర్వరాని, ఓలలాడు = మునుగు, తేలు, ముప్పిరి = ఎక్కువైన, గాఢమగు, రేచగా = రేపగా, చిమ్ముట = విరజిమ్ము అనే అర్థంతో ఎక్కువగా అని చెప్పడం. వొట్టిన = ఉత్తినే అన్న అర్థంతో ఊరకనే అని ఇక్కడ అనుకోవాలి. తమకము = పొంగి పొరలు ఇష్టంతో ఉండడం, గుబ్బతిలీని = అతిశయించు, ఉప్పొంగు, పరితపించు, పులకలు = పులకరింత (ఓ విధమైన ఆనందాతిశయము) విఱ్రవీగు = అధిక సంతోషము, పిక్కటిల్లు = వర్ధిల్లు, నిండు, వ్యాపించు, పెనగొను = చేరు, కలియు, మెలికలు తిరుగు.

**విశేష పదములు:** మనం కనకధారా స్తోత్రం గమనించినట్లైతే మొదటి శ్లోకంలో శంకరభగవత్పాదుల వారు "అఙ్గం హరేః పులకభూషణ మాశ్రయంతీ" అంటారు. "పులకాంకురముల తోడి శ్రీహరి శరీరమును ఆశ్రయించినది" అని అన్నారు. అన్నమయ్య అదే పదాన్ని ఇటు పద్మావతీ దేవికి వాడి ఆమె శ్రీహరి ఆలోచనలు రాగానే పులకించి పోతున్నది అంటున్నాడు.

## ఖండిత

కావ్యములలో శృంగారరసమునకు ఆలంబనగా నాయికా నాయకులు నిలుస్తారు. నాయికానాయకుల చక్షుఃప్రీతి, మనస్సంగములవల్ల కలుగు మనోవికారమే రూఢమై శృంగారరసముగా పరిణమించును. నాయికా ప్రసక్తిలో ఆసక్తికరమైన విషయము అష్టవిధశృంగార

నాయికావర్గీకరణము. ఇది నాయిక తాత్కాలిక మనోధర్మ వర్గీకరణమే కాని, నాయికాప్రకృతి వర్గీకరణము కాదు. అనగా ఒకే నాయిక తత్తత్కాలమనోధర్మము ననుసరించి, ఈ అష్టవర్గములలో ఏదో యొక వర్గమునకు చెంది యుండుననుట సబబు. ఆ కోవలో ఖండిత ఒక నాయిక. ఈ ఖండిత నాయికను గుఱించి అన్నమయ్య ఏ విధంగా తెలియజేశాడో తెలుసుకునే ముందుగా ఖండిత నాయిక లక్షణాలను తెలుసుకుందాం. ఖండిత నాయికను "నీత్వాన్యత్ర నిశాం ప్రాతరాగతే ప్రాణవల్లభే – అన్యాసంభోగచిహ్నై స్తు కుపితా ఖండితా మతా" అని విద్యానాథుని ప్రతాపరుద్రీయములో నిర్వచించాడు. అనగా 'రాత్రియంతయు అన్యకాంతతో గడిపి, ప్రొద్దున తత్సంభోగచిహ్నములతో వచ్చిన నాయకునిపట్ల కుపితయైన నాయిక ఖండిత' అని అర్థము. ప్రియుడు అన్యకాంతాసంగము చేసి వచ్చినాడని శంకించి కోపగించిన నాయిక ఖండిత. అన్యకాంతాసంగమము జరిగినదను అనుమానవే ఈనాయికయొక్క రోషదైన్యాదులకు కారణము అని గమనించవలసి యున్నది. సాపరాధుడైన నాయకుని దేహమునందలి పరకాంతా సంగమ సంకేతములను పరిశీలించి, చింత, నిశ్వాసము, ఖేదము, సఖీసంలాపము, గ్లాని, దైన్యము, అశ్రుపాతము, రోషము, భూషణత్యాగము, రోదనాదులతో ఖండితానాయిక తన యవస్థ నభినయించవలెనని భరతుడు తన నాట్య శాస్త్రంలో తెల్పినాడు. రసార్ణవసుధాకరములోని శ్లోకము ఖండితా నాయికయొక్క చేష్టలను చక్కగా వర్ణించబడినది. "ప్రభాతే ప్రాణేశం నవమదనముద్రాంకితతనుం / వధూర్దృష్ట్వా రోషాత్ కిమపి కుటిలం జల్పతి

ముహుః / ముహుర్ధత్తే చిన్తాం ముహురపి పరిభ్రామ్యతి ముహు / ర్విధత్తే నిఃశ్వాసం ముహురపిచ బాష్పం విసృజతి" దీని అర్థం ఏమిటంటే... ప్రభాతమునందు ప్రాణేశునియొక్క నవమదన ముద్రాంకితమైన శరీరమును గాంచి, రోషంతో మాటికి మాటికీ ఏవో ఎత్తిపొడుపు మాటలు అనడం. మఱిమఱి చింత వహిస్తూ...నిలుకడ లేక చలించడం, నిశ్వాసములు వెడలించడం, కన్నీటిని ధారగా గార్చడం. ఈ విధంగా నాయిక నాయకుని ప్రవర్తన పట్ల గలిగిన సంక్షోభము నామె చేష్టలలో వ్యక్తం గావడం.

వక్రోక్తి (వ్యాజస్తుతి) గల శ్లోకము ఒకటి "పుష్పబాణవిలాసం" గ్రంధంలో ఉన్నది. "సత్యం తద్యదవోచథా మమ మహాన్ రాగ స్త్వదీయాదితి/ త్వం ప్రాప్తో సి విభాత ఏవ సదనం మాం ద్రష్టుకామో యతః - రాగం కించ బిభర్షి నాథ హృదయే కాశ్మీరపత్త్రోదితం / నేత్రే జాగరజం లలాటఫలకే లాక్షారసాపాదితమ్." దీని అర్థం "ఓ నాయకుడా! నాకు మనసులో మాత్రమే నీపై రాగమున్నది. మఱి నీకో శరీరమందంతటను రాగమున్నది. నీయెదలో కశ్మీరపత్ర రాగ మున్నది. కనులలో జాగరణరాగ మున్నది. నొసటిపై లాక్షారసరాగ మున్నది. నాపై ఎంత మక్కువయో, నాకడకు పెందలకడనే వచ్చితివి అని అన్యాపదేశంగా నాయకుని రాత్రి రాలేదని దెప్పి పొడుస్తూ మాట్లాడడం. నీవు వచించినట్లు నీకు నాయందు గల రాగాతిశయ మధికమైన దనుటలో అసత్యమింతయు లేదు. ఇచ్చట రాగ మనగా అనురాగమనియు, ఎఱ్ఱదనమనియు గ్రహింపవలెను. 'నాకు మనసులో మాత్రమే రాగమనగా అనురాగ మున్నది. మరి నీకు శరీర మంతటను రాగము ఉన్నది' అని అని అన్యాపదేశంగా శరీరం మొత్తం ఎర్రదనం

ఉన్నదంటూ వ్యాజస్తుతిచే నాయిక నాయకుని వక్రోక్తితో నిందిస్తూ ఉన్నది.

అన్నమయ్య శృంగార కీర్తనలో "అనుమానించగనేలా అవిగో నీ చేతలు...దిన దిన కొత్తలెల్లా దిష్టమాయ మాకు" అంటూ ఖండిత అయిన నాయిక నాయకునితో పలికే వింత వింత పలుకులను విందాం.

పల్లవి: అనుమానించగనేలా అవిగో నీచేతలు
దినదిన కొత్తలెల్లా దిష్టమాయ మాకు. ||పల్లవి||
చ. 1.కొసరి యెవ్వతె నీతో కొంగువట్టి పెనగెనో
పసపల్లా నంటె నదె పచ్చడానను
యెసగి చెక్కులువట్టి యెంత వేడుకొనెనో
సుసరాన గోరికొన సోకులు చూపట్టెను ||అను||
చ. 2. కమ్మటి నాపె యేరీతి కాగిట బిగించెనో
కుమ్మెలువోయి గుబ్బలగురు లున్నవి
యిమ్మల నీవాడివట్టి ఎంత వొడబరచెనో
నెమ్మది గానుకిచ్చిన నిమ్మపండ్లు గంటిని ||అను||
చ. 3. పదాలకు మొక్కి యెట్టు పానుపుపై గూడెనో
పోదితో మైతావి నీపై బొలుపొందెను
పొదుగ నలమేల్మంగ పతివి శ్రీవేంకటేశ
యీదెశనన్నేలితివి ఈకె నీకు జట్టము ||అను||
(రాగము: శంకరాభరణం, 28-286 రాగిరేకు 1849)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక ఖండితయైన

అలమేలుమంగమ్మ, నాయిక నాయకుని పరకాంతతో గడిపి వచ్చాడని కోపంతో మాట్లాడే సన్నివేశం.

స్వామీ! ప్రాణనాథా! నేను అనుమానించానని అనుకోవడం ఎందుకు? ప్రతిరోజూ నీచేతలు నాకు వింత వింతగా కొత్తగా కొత్తగా కనిపిస్తున్నాయి.

స్వామీ! ఏ కాంత నీ కొంగు పట్టుకుని చుట్టుకుని నీతో తిరిగినదో! ఎట్టటి వర్ణం నీ వస్త్రాలకు అంటుకున్నది చూశారా! నీ చెక్కిలి పట్టుకుని ఎంత వేడుకున్నదో మరి! అంత సులభంగా నిన్ను వశం చేసుకున్న తార్కాణాలుగా నఖ, దంతక్షతాలు కనపడుతున్నాయి.

అందమైన ఆమె నిన్ను ఎంత గట్టిగా కౌగిలిలో బంధించిందో మరి! ఆమె వక్షోజాల వత్తిడి ముద్రలతో నీ ఎద గాయాలు అయినది. నిన్ను వశపరచుకుని నీ వొడిలో ఇబ్బడిముబ్బడిగా ఏమి ఆటలాడినదో తెలీదు నీ వొడిలో కిచ్చిలి నారింజపండ్లు ఉన్నవి.

స్వామీ! నీ పాదాలకు మ్రొక్కి ఏవిధంగా, పాన్పుపై జేరి నీతో జతగూడినదో! ఆమె ద్వారా వచ్చిన గంధము, కర్పూరము మొదలైన పూతలు నీ శరీరం పై అందంగా శోభిస్తున్నాయి అని అమ్మవారు అంటున్నారు. నిలకడగా ఆలోచిస్తే నీవు అలమేల్మంగపతివి కదా! ఈ విధంగా ఏలుకుంటున్నావు అలాంటప్పుడు ఈమెయే నీకు అందమైన జత సుమా! అని అన్నమయ్య స్వామికి నివేదిస్తున్నాడు.

**అర్థాలు:** దిష్టము = చూడబడినవి, పసపల్లా = ఎర్రటి కాంతిగల, పచ్చడము = వస్త్రము, చెక్కులు = చెక్కిలి, సుసరము = సులభము, కుమ్మెలువోయి

= గాయమవడం, గుబ్బలగురుతులు = వక్షోజాల ఒత్తిడి గుర్తులు, ఇమ్మల = రెండింతలు, వొడబరచెనో = ఒప్పించెనో, అంగీకరించేట్టు చేసెనో, కిచ్చిన నిమ్మపండ్లు = కిచ్చిలి నారింజ పండ్లు, పోదితో = గొప్పగా అనే అర్థంలో (విశేషణం), మైతావి = శరీరంపై పూత, పొలుపు = అందము, సొంపు, పాదుగ = ఆశ్రయముగ, ఈకె = ఈమె, జట్టము = అందమైన, సరియైన విధానముతో ఉన్నది అనే అర్థం.

## విప్రలబ్ధ

అన్నమయ్య కీర్తించిన విప్రలబ్ధ శృంగార కీర్తన తెలుసుకునే ముందు విప్రలబ్ధ నాయిక గురించి కొంత తెలుసుకుందాం. "క్వచిత్సంకేత మావేద్య దయితే నాథవృతా/ స్మరార్తా విప్రలబ్ధేతి కలావిద్భిః ప్రకీర్త్యతే/" అని విద్యానాథుని ప్రతాపరుద్రీయములో చెప్పాడు. "ఒకానొక సంకేతస్థలమునకు రమ్మనిన ప్రియుడు, ఆ సంకేతమునకు తాను రాకుండుటచే వంచింపబడి, స్మరార్తయైన నాయిక విప్రలబ్ధ యని కలావిదులందురు" అని అర్థము. భానుదత్తుడు రసమంజరిలో "సంకేతనికేతనే ప్రియమనవ లోక్యసమాకుల హృదయా విప్రలబ్ధా/ అస్యాశ్చేష్టా నిర్వేద నిశ్వాస సంతాపాలాప భయ సఖీజనోపాలంభ చింతాశ్రుపాత మూర్ఛాదయః/" అన్నాడు. 'సంకేతనికేతనమున ప్రియుని గానక వ్యాకులమతి యగునది విప్రలబ్ధ. తత్ఫలితముగా నీమె నిర్వేదము, నిశ్వాసము, సంతాపము, ప్రలాపము, భయము, చెలులను, పరిసరములను నిందించుట, చింతించుట, ఏడ్చుట, మూర్ఛిల్లుట అను చేష్టలను చేయును' అని ఈ లక్షణమును వివరించాడు.

నాట్యశాస్త్రములో భరతుడు కూడా ఈచేష్టలద్వారానే విప్రలబ్ధ తన యవస్థ నభినయించవలెనని తెల్పినాడు.

పై శ్లోకాల వివరణలు గమనిస్తే విప్రలబ్ద అనే శృంగార నాయిక, సంకేతస్థలానికి ప్రియుడు రానందుకు వ్యాకులపడే నాయిక, మోసగించబడినది గా భావించవచ్చు. ఈమె రాత్రంతా ప్రియుని కోసం వేచియున్న నాయికగాను మరియూ ప్రియుడు నమ్మించి రానందుకు కోపగించి ఆభరణాలను విసిరిపారేసే వనితగాను చిత్రకారులు చిత్రిస్తూ ఉంటారు.

ఇక్కడ అన్నమయ్య మనకు విప్రలబ్ధ అయిన నాయిక చెలికత్తెలతో తనగోడు చెప్పుకునే విధానాన్ని వివరిస్తున్నాడు. చూడండి.

ప. తానెంత మన్నించినాను తన చిత్తమింతే కాక
నేనే నా యంత వలపు నెరపగవచ్చునా ||పల్లవి||
చ. 1. తలపు గలిగితేను తానే వచ్చీ గాక
బలిమి దన్ను బిలిచేపాటి దాననా
అలరి దయవుట్టితే నాదరించీ గాక నన్ను
కలికితనాల దన్ను గరగించ నేర్తునా ||తానెంత||
చ. 2. చుట్టరిక మెంచి నన్ను సొరిది నేలీ గాక
వట్టి వినయాల దన్ను వంచ గలనా
అట్టె తనవేడుకకు నంటిపెనగీగాక
గుట్టుతోడ మెప్పించి కొసర నావసమా ||తానెంత||
చ. 3. మొగమోటమున దానే ముంచి కాగిలించీ గాక
నగుతా గొనగోర జెనకవచ్చునా

తగ శ్రీవేంకటేశుడు తానే నన్ను నేలె గాక
జిగిమించి తన్ను రట్టు సేయగ సంగతా ||తానెంత||
(రాగము: పాడి, 28-534, రాగిరేకు 1891)

విశ్లేషణ: ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక విప్రలబ్ధ యైన పద్మావతీదేవి, నాయిక చెలికత్తెలతో నాయకునికి గురించి తెలియజేసే సన్నివేశం.

చెలులారా! చూశారా! తనను నేను ఎంత గౌరవిస్తున్నానో మీకు తెలియనిది కాదు కదా! శ్రీవారి చిత్తము నెరుగక నేను వలపు సందేశాలు పంపించ వచ్చునా! అని అమ్మవారు పద్మావతిదేవి చెలికత్తెలతో తనంత తాను వచ్చి నన్ను చేపట్టడంలేదని వాపోతున్నది.

ఒకవేళ నామీద కోరిక, యిష్టం ఉన్నట్లయితే తానే విచ్చేయవచ్చుగదా! నాకై నేను తనను ఔదార్యంతో పిలవడం కుదురుతుందా చెప్పండి. నామీద ప్రేమ, యిష్టం, దయ ఉంటే నన్నాదరించి తీరుతాడు కదా నా స్వామి. నేనే స్వామిని మోహింపజేసేవిధంగా ప్రవర్తించడం సబబేనా? నా కౌగిట్లో కరిగించాలనుకోవడం ఎంతమాత్రం ఒప్పో చెప్పండి అని అడుగుతోంది నాయిక.

నేను వరుస అవుతానుకదా చుట్టరికమునెంచైనా నన్ను జేరవచ్చును గదా! వినయంతో అతన్ని లొంగదీసుకోవడం బావుంటుందా? తను వేడుకతో నన్ను కూడడం బావుంటుంది కదా! అలా కాక గుట్టుగాను, మోసంతోనూ విజృంభించిన కోరికలతో స్వామిని చేరడం ఏమైనా మర్యాదగా ఉంటుందా?

దాక్షిణ్యం చూపి తానే వచ్చి నన్ను కౌగలించుకోవడం ఎంత బావుంటుంది చెప్పండి? అలాకాక నవ్వుతూనే గోటగిల్లడం సబబేనా?

శ్రీవేంకటేశ్వరుడు తానే వచ్చి నన్ను యేలుకున్నట్లైతే ఎంత బావుంటుంది. కాంతులీనే నాస్వామిని మోహంతో నేను రచ్చకీడ్చడం ఎంతవరకూ సరయిన విషయమో చెప్పండి అని చెలికత్తెలను అడుగుతోంది అమ్మ పద్మావతి.

**అర్థాలు:** మన్నించు = గౌరవించు, నెరపుట = నెరవేర్చుట, నింపు, వ్యాపింపజేయు, తలపు = కోరిక, బలిమి = ఔదార్యం, అలరి = ఇష్టము, సంతోషము, కలికితనము = చక్కదనం, కరగించు = కరుగజేయడం, లొంగదీసుకోవడం, సొరిది = వరుస, క్రమము, పెనగు = కలియు, కూడు, గుట్టుతోడ = వంచనతో, కొసరు = విజృంభించు, ఏదైనా కొన్నపుడు అధికంగా వేసే కొసరు అర్థం ఇక్కడ సరిపోదు, మొగమాటము = దాక్షిణ్యము, గోరజెనకు = గోటగిల్లు, జిగిమించు = కాంతులీను, ప్రకాశము, రట్టుసేయు = రచ్చకీడ్చు, నవ్వులపాలుసేయు.

## కలహాంతరిత

కలహాంతరిత అనే నాయికకు నాట్యశాస్త్రంలో "ఈర్యాకలహనిష్క్రాన్తో యస్యా నాగచ్ఛతి ప్రియః -సామర్షవశసంప్రాప్తా కలహాన్తరితా భవేత్" అని నిర్వచనం చెప్పబడినది. అనగా "కలహేన అంతరితా వ్యవహితా అర్థాత్ ప్రాణనాథతః" అంటే "కలహమువల్ల ప్రాణవల్లభునితో ఎడబాటుకు గురియైనది" అని కలహాంతరితా శబ్దమునకు వ్యుత్పత్తి ఉన్నది. ఈ కలహము అనేది రోషము లేక ఈర్ష్యాసహనములచేత కలుగవచ్చును. ఇట్టి మనఃస్థితి అన్యకాంతానురక్తుడైన నాయకుని విషయంలో సాధారణముగా సహజము.

తనచే కోపించబడి, దూషించబడి, దూరమైన నాయకునిగూర్చి చింతించుచు, తన చర్యకు తాను పశ్చాత్తాపము నొందుచు ఉన్న నాయికను కలహాంతరిత అంటారు.

"అమరుకశతకం" లోని శ్లోకము ఒకటి 'కలహాంతరితకు చక్కని ఉదాహరణగా చెప్పబడినది. "చరణ పతన ప్రత్యాఖ్యాన ప్రసాద పరాఙ్ముఖే/ నిభృతకితవాచారేత్యుక్తే రుషాపరుషీకృతే – వ్రజతి రమణే నిఃశ్వస్యోచ్చైః స్తనార్పితహస్తయా/నయనసలిలచ్ఛన్నా దృష్టిస్సఖీషు నిపాతితా" అనగా నాయకునియందు పరస్త్రీ సంభోగచిహ్నములు బయల్పడుటచే ఆమె కోపోద్రిక్త అవగా, నాయకుడు ఆమె కోపమునుపశమింప జేయుటకై ఆమె చెలుల సమక్షములో నాయకుడామె పాదములపై బడినాడు. అయిననూ ఆమె అతనియందు విముఖురాలైనది. 'నిభృతకితవాచారా' అన్నది అనగా "సిసలైన మోసగాడా" అని నాయకుని ఆమె తన చెలుల ఎదుటనే పరుషముగా నిందించినది. అతడు రోషముతో వెళ్ళిపోబోవుచుండగా ఆపుటకు ఆమెకు మానమడ్డము వచ్చినది. అంతలో తన చెలుల చేష్టల కామెకు కొంత పశ్చాత్తాపమునూ కల్గినది. అప్పుడామె స్తనతటమందుంచిన హస్తములతో, దీర్ఘ నిట్టూర్పులతో, అశ్రుచ్ఛన్నములైన నేత్రములను చెలులపై నిల్పినది. ఎందుకంటే మీరయినా ఆపవచ్చుగదా అన్న ఉద్దేశ్యంతో. కోపముతో నిందింపబడిన నాయకుడు, కలహాంతరిత అనే నాయికను విడిచి వెళ్ళిపోగా తన చేష్టలకు తాను పశ్చాత్తాపము నొందు నాయిక యిందు వర్ణింపబడినది.

రామరాజభూషణుని కావ్యాలంకారసంగ్రహములోని ఒక

ఉదాహరణము కడు రమ్యముగా నున్నది. దానిని కూడా చూద్దాం. ''ఆనగరాని కోపమున నప్పుడు కాంతుని ధిక్కరించుచో/ మానదురాగ్రహాగ్రహము మానుపలేకపు డెందు బోయెనో/ యా ననవింటిదంట యిపు డేపదొడంగె, భవిష్యదర్థముల్ /గానని నా మనంబునకు గావలె నిట్టి విషాదవేదనల్." అనగా ఈర్ష్యాకోపముల బట్టలేక ఒకకాంత నాయకుని దూషించి, తిరస్కరించినది. సహజముగా అతడామెకు దూరమైనాడు. వల్లమాలిన మానము, దురాగ్రహములనెడు భూతము తనను సోకినప్పుడు వానిని నివారింపలేని మన్మథుడు తననిప్పుడు సోకి బాధించుచున్నాడు. ముందుచూపు లేక యట్లు ప్రవర్తించిన తన మనసున కిట్టి దుఃఖము, ప్రయాస కల్గవలసినదే యని ఆకాంత పశ్చాత్తప్తురాలైనది. ఆమెయే కలహాంతరిత అనే నాయిక.

ఈ మనస్థితి కలిగిన కలహాంతరిత అనే నాయికను అన్నమయ్య ఏవిధంగా వర్ణించాడో చూద్దాం. అమ్మ అలమేలుమంగమ్మ స్వామితో వ్యంగ్యముగా శ్రీహరి చేసే చిలిపిచేష్టలను వర్ణిస్తూ... ఇలా చేయదగునా... చూసే వారు నిన్ను ఏమనుకుంటారు అని అడుగుతోంది. ఆ సరదా శృంగార గీతిక విందాం.

పల్లవి: గుట్టుతోడిదాన నన్ను గొరబేల సేసేవోయి
గట్టిగా సేసవెట్టితే గాదంటినా నిన్ను ॥పల్లవి॥
చ. 1. చన్నులంట వచ్చేవు జాణతనా లాడేవు
ఇన్నేసి చేతలకు నీకేమౌదునోయి
సన్న లూరకె సేసేవు సందులకు లాచేవు

కన్నవారెల్లా నిన్ను గామిడివాడనరా ||గుట్టు||

చ. 2. కప్పురము చల్లేవు కతలెల్లా జెప్పేవు
అప్పుడే నీకు జుట్టమనైతినావోయి
కొప్పు జారదీసేవు కొనగోర జెనకేవు
వుప్పతించేవారు నిన్ను నుద్దండీ డవనరా ||గుట్టు||

చ. 3. మోవితేనె లడియేవు మోము దప్పక చూచేవు
వావు లింత గలపగవలెనా వొయి
శ్రీవేంకటేశ నన్ను జెలరేగి కూడితివి
యీవలావలివారు యిచ్చకుడ వనరా ||గుట్టు||

(రాగము: రీతిగౌళ, 28-297, రాగిరేకు 1851)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక కలహాంతరితయైన అలమేలుమంగమ్మ, నాయిక నాయకునితో వ్యంగ్యముగా మాట్లాడే సన్నివేశం.

శ్రీనివాసా! నాథా! గుట్టుగా కాపురం వెళ్ళదీస్తున్న నాతో వెర్రిమొర్రి వేషాలు వేయడం ఎందుకు? అతిశయించిన ప్రేమతో ఇష్టపడితే నిన్ను నేను కాదంటానా? పరకాంతలతో గడపడం ఎందుకు అని అన్యాపదేశంగా అనడం.

స్వామీ! నా వక్షస్థలం చేరడానికి వస్తావు కానీ ఈ నేర్పులేమిటో? ఈ వింత వింత ధోరణులేమిటో నాకు అర్థం కావడంలేదు. నీవు ఇన్ని విధాలుగా చేస్తూ ఉంటే నేనేమవుతాను చెప్పండి? ఊరకే ఏవో సైగలు చేస్తావు మధ్య మధ్యలో నన్ను వూరిస్తావు. చూసినవారు నిన్ను చెడ్డవాడు

అనుకోవడం బావుంటుందా చెప్పండి? అని వ్యంగ్యంగా అడుగుతోంది అమ్మ.

పచ్చటి ముద్ద కర్పూరపు పొడి నాపై చల్లుతావు. ఎన్నో విషయాలు కథలు కథలుగా చెప్తావు. అప్పుడే నీకు బంధువునైతిని గదా! ముడివేసుకున్న కొప్పును జారదీస్తావు. కొనగోట ఎక్కడెక్కడో తాకుతావు. ఓర్వలేని వారు చూసి నిన్ను తెగువరియని (ఉద్దండుడు) అనడం సబబుగా ఉంటుందా?

స్వామీ! అధరామృతాన్ని అడుగుతావు. నా మోము వైపే చూస్తూ ఉంటావు. ఇంతగా బంధుత్వం కలపవలసి యున్నదా? చెప్పండి. శ్రీవేంకటేశ్వరా! నన్ను నిత్యం మిక్కిలి విజృంభించి కలుస్తావు. అటూ ఇటూ చూసేవారు ఏమనుకుంటారు? నిన్ను కపటవర్తనుడనుకోవడం నాకు ప్రీతిగా ఉంటుందా? స్వామీ! ఇవన్నీ మానుకోండి. అని వ్యంగ్యంగా చెప్తోంది అమ్మ నాయకునికి.

**అర్థాలు:** గుట్టు తోడ = రహస్యం, దాపరికం, గొరబు = వికార చేష్టలు, వేషాలు వేయడం, సేస = అక్షింతలు, జాణతనము = నేర్పరితనము, సన్నలు = సైగలు, సందులు = మధ్య, లాచేవు = పొంగేవు, పొంచేవు, కన్నవారు = చూసినవారు, కామిడివాడు = చెడ్డవాడు, చెనకు = తాకు, ఉప్పతించేవారు = చూసి ఓర్వలేనివారు, ఉద్దండీడు = తెగువరి, ఉద్దండుడు, మోవితేనె = అధరామృతము, వావులు (వావికి బహువచనంగా వాడబడిన పదం) = బంధుత్వము, చెలరేగు = మిక్కిలి విజృంభించు, ఇచ్చకుడు = ప్రియవాది, కపటవర్తనుడు.

## పోషిత భర్తృక

భర్త/ప్రియుడు దూరదేశానికి వెళ్ళగా అతనిని గురించి చింతించే నాయికను పోషిత భర్తృక అంటారు. రామరాజభూషణుడు తన "కావ్యలంకార సంగ్రహం" లో పోషిత భర్తృక ను గూర్చి ఇలా చెప్పారు.
చ. చిరశయ! ఓ భభూవరు నృసింహ !భవద్రిపుభామ కాననాం/ తరమునకేగి యందు నిజనాధుని గానక మన్మధార్తయై/ వరుని సరోజ పత్రమున వ్రాయునెడం గరముల్ చెమర్పగా నరయు నిజాంగ కంబెపగయయ్యె నటంచు దలంచు దైవమున్!". అనగా నీ శత్రువు భార్య భర్తతో అడవికి వెళ్ళి ఆతడు అక్కడనుండి ఆమెకు తెలుపకుండా పారిపోగా తన భర్తను గానక మదనార్తయై ప్రియుని పద్మపత్రమున రాయునపుడు చేతులు చెమర్పగా తన అవయవములే తనకు శతృవులుగా అయ్యెనని దైవమును తలంచెను. ఇట శత్రు కాంత పోషిత భర్తృక. కనుక అతనిమీది అనురాగం వ్యామోహం ఎక్కువై చెలికత్తెలతోనూ.. తెలిసినవారితోనూ తన అవస్థను చెప్పుకోవడం పోషితభర్తృక లక్షణం.

అన్నమయ్య అలా కాక దేశాంతరం తిరిగి వచ్చిన పతిని జాగ్రత్తగా చూసుకోమని సేవలు చేయమని అన్నమయ్య చెలికత్తెల వేషంలో అమ్మకు చెప్తున్నాడు. వీక్షించండి.

పల్లవి: ఎట్టినోము నోచితివో ఇదివో నీభాగ్యము
చుట్టరికములెల్లాను చూపవమ్మా ॥పల్లవి॥
చ.1. యెంత బత్తో నీమీద నింటికి వచ్చెనతడు
చెంతనుండి వూడిగాలు సేయవమ్మా

వంతుకు నీమీద నిదె వలపులు చలీని
వింతలు సేయక ఇక విడెమియ్యవమ్మా ||ఎట్టి||
చ. 2. యేమి వేడుకో కానీ యేకతాలు నీతోనాడి
వేమారు సుద్దులడిగీ వినవమ్మా
దోమటి బాదాలు నీ తొడలపై జాచీని
మోము చూచి వేడుకతో మొక్కవమ్మా ||ఎట్టి||
చ.3. యేరీతి మన్ననో నేడు ఇన్ని చందములనేలె
చేరి ఇచ్చకములెల్లా జేయవమ్మా
గారవించి నిన్ను శ్రీవేంకటేశ్వరుడు గరుణించె
కూరిమి నిటువలెనే గూడి వుండవమ్మా ||ఎట్టి||
(రాగము: మాళవిగౌళ, 28-81, రాగిరేకు 1815)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక పోషితభర్తృక యైన అలమేలుమంగమ్మ, నాయికతో చెలికత్తెలు మాట్లాడే సన్నివేశం.

చెలికత్తెలు అమ్మతో అంటున్నారు. అమ్మా! ఎలాంటి నోములు నోచావో, ఏమి వ్రతాలు పట్టావో తెలియదు. ఇదిగో నీ భాగ్యము పండింది నేడు. నీ నెయ్యము, బంధుత్వము, వరుస, వావి, వియ్యము అన్నీ చూపించవమ్మా ఇక ఆ స్వామికి అని నివేదిస్తున్నారు.

అమ్మా! నీ మీద స్వామివారికి ఎంత శ్రద్ధ, ఆసక్తి ఉన్నాయో చూడు. ఇంటికి విచ్చేశాడు. నీవు దగ్గరే ఉండి అతని సేవలు చూసుకోవాలి సుమా! ఒకవేళ ప్రయాణ బడలిక వలననో మరేకారణంచేతయినా ఆయన అన్యమనస్కంగా ఉండి నీమీద వలపు బాణాలు వేసినప్పటికీ నీవు ఏమీ మారుమాటాడక తాంబూలం అతనికి అందించు అని సూచిస్తున్నారు.

అమ్మా! అదేమి వేడుకో తెలీదు స్వామికి ఎన్ని ఎగతాళిమాటలు? ఎన్ని సరదా మాటలు? అనేక సార్లు నీ క్షేమ సమాచారాలు అడుగుతాడు. సరదాగా ఆయన పాదాలు నీ తొడలపై పెట్టనీ..నీవు మాత్రం ఆయన ముఖకమలాన్ని చూసి శ్రద్ధగా మొక్కాలి సుమా! అంటున్నారు.

అమ్మా! ఎటువంటి ప్రేమయో నీమీద ఇన్నివిధాల నిన్ను గౌరవించి ఏలుకుంటున్నాడు. ఆస్వామిని చేరి మంచి కబుర్లు చెప్పవమ్మా! స్వామికి ఇష్టమైన మాటలు మాట్లాడు. శ్రీవేంకటేశ్వరుడు నిన్ను కరుణించాడు. మంచి పొందికతో స్వామివారిని కూడి చేరి ఉండమని చెప్తున్నారు చెలికత్తెలు.

**అర్థాలు:** చుట్టరికము = నెయ్యము, బంధుత్వము, వావి, వరుస, బత్తి (వి) = భక్తి (ప్ర), వూడిగాలు = సేవలు, ప్రియమైన పనులు, వింతలు = విశేషము, పెద్దవి, విడెము = తాంబూలము, వేడుక = ఆనందము, దోమటి = మాయ, కపటము, చందము = విధము, ఇచ్చకములు = ముఖప్రీతికరం, ప్రీతికరం, ప్రియం, కూరిమి = స్నేహము, కూడి = చేరియుండుట.

## అభిసారిక

"మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియమ్ - జ్యోత్స్నా తమస్వినీ యానయోగ్యాంబర విభూషణా" స్వయం వాభిసరేద్ యా తు సా భవేదభిసారికా" (రసార్ణవసుధాకరము). మదనానలసంతప్తయై ప్రియుని తనకడకు రప్పించుకొనునది గాని, వెన్నెల రాత్రులలో, చీకటిరాత్రులలో తన్నితరులు గుర్తింపనిరీతిగా వేషభూషలను ధరించి రహస్యముగా ప్రియుని

గలియుటకు సంకేతస్థలమునకు బోవునది గాని, అభిసారిక యనబడునని పైశ్లోకమునకు అర్థము.

కానీ ఈ అభిసారిక నాయికలలో ఉన్న స్వల్ప బేధాలను గమనిస్తే మొదటి రకమైన యభిసారిక సామాన్యముగా నొక దూతిక ద్వారా సందేశమును పంపి, ప్రియుని తనకడకు రప్పించుకొనును. అతడు వచ్చినప్పుడు వాసకసజ్జికవలెనే సర్వము సంసిద్ధము చేసికొని అతనితో సవిలాసముగా గడపును. ఇట్లు ఈవిధమైన అభిసారికకు, వాసకసజ్జికకు, కించిద్భేదమే యున్నది. వస్తుతః శృంగారమంజరీకర్త వంటి కొందఱు లాక్షణికులు ఈరకమైన అభిసారికను వాసకసజ్జికగానే పరిగణించుచున్నారు. అలా కాక తానే ప్రియుని సంకేతస్థలమున కలసికొనునది రెండవరకమైన అభిసారిక. ఇట్టి అభిసారికనే తరచుగా కవులు ప్రబంధములలో, కావ్యములలో వర్ణించియున్నారు. ఇందులో స్వీయా, పరకీయా, సామాన్యా భేదము లున్నవి. స్వీయ యనగా తన కంకితయైన ప్రియురాలు. పరకీయ వేఱొక స్త్రీ. ఈమె కన్యక గాని, అన్యవిధమైన స్త్రీ గాని కావచ్చును. సామాన్య యనగా వేశ్య. గూఢముగా వెన్నెలరాత్రులలో నభిసరించు స్త్రీకి జ్యోత్స్నాభిసారిక యనియు, అట్లే చీకటిరాత్రులలో నభిసరించు స్త్రీకి తమోభిసారిక యనియు పేర్లు. బాహాటముగా నభిసరింప బోవు స్త్రీకి ఉజ్జ్వలాభిసారికయని పేరు. వీరిలో జ్యోత్స్నా, తమోభిసారిక వర్ణనమే అధికముగా కావ్యములలో కన్పించుచుండును.

అన్నమయ్య కీర్తనలలో నాయిక అమ్మవారు కనుక జ్యోత్స్నాభిసారిక వర్ణను, తమోభిసారిక వర్ణను వర్జించి నాయకుని తనవద్దకు రప్పించుకొని మాట్లాడే అభిసారికగా వర్ణించిన విధానాన్ని పరిశీలిద్దాం.

పల్లవి: వాకిట నుండి యెంత వాడికలు సేసేవు
లోకమెల్లా నెరుగును లోనికి రావయ్యా ||పల్లవి||

చ. 1.పడతి వినయముల బయలు వందిలి వెట్టె
తడబాటు సిగ్గులను దడిగట్టెను
వుడివోని తమకము నొడినిండా నీకు నించె
యెడమాట లికనేల ఇంటికి రావయ్యా ||వాకిట||

చ. 2. కలికి కనుచూపుల కానుకలు నీకు నిచ్చె
సులభాన వలపుల సూడిదలంపె
సెలవుల నవ్వులనే చిత్తమెల్లా గరగించె
వెలినుండి జంపులేల విడిదికి రావయ్యా ||వాకిట||

చ.3. భామ తమ్మిమొగ్గలను పాన్పు నీకు బరచె
వేమరు మోవి తేనెల విందులు వెట్టె
ఆముక శ్రీవేంకటేశ యట్టె యీకె గూడితివి
దామెల సన్నలవేల తావుకు రావయ్యా ||వాకిట||

(రాగము: లలిత, 28-463 రాగిరేకు 1879)

ఈ కీర్తనలో శ్రీవేంకటేశ్వరుడు నాయకుడు, నాయిక అభిసారికయైన అలమేలుమంగమ్మ, నాయకుని తనవద్దకు రప్పించుకొని మాట్లాడే సన్నివేశం.

అమ్మ శ్రీవేంకటేశ్వరునితో ముచ్చటలాడుతున్నది. ఇలా ఎంతసేపు వాకిటిలో నిలబడి రహస్యంగా ఈ కథ నడిపిస్తావు? మన విషయాలు లోకంలో అందరికీ తెలుసు గానీ ఇక త్వరగా లోనికి విచ్చేయవయ్యా మహాప్రభో! అని వేడుకుంటున్నది.

నా యొక్క వినయ విధేయతలవలన విషయం బయటపడిపోయి ఆపద నెత్తికెక్కేట్టున్నది సుమా! నా యొక్క తడబాటు ఆతృత సిగ్గులతో గూడి దడి గట్టినట్లైనది. మనం తొలిసారిగా కలిసినపుడు మాట్లాడుకున్న మాటలు మళ్ళీ మళ్ళీ నెమరు వేసుకోవలసినవి చాలా ఉన్నవి. ఇంకా యెడమాటలు ఎందుకు త్వరగా వచ్చేయండి స్వామీ శ్రీనివాసా! అంటున్నది అమ్మ.

తన గురించి చెప్పుకుంటూ అందమైన మనోజ్ఞమైన ఆడదాని ఓరకంటి చూపులు సులభంగా వలపుల కానుకలవలే నీకు ఇస్తున్నాను కదా! నీ నవ్వులచే నా మనసు కరిగి నీరై పారుతున్నది సుమా! బయటనుండి నీ చూపులతో ఎందుకు నన్ను ఇంకా చంపుతున్నావు హాయిగా విడిదికి వచ్చి నన్నేలవయ్యా! అంటోంది అమ్మ.

నిను వలచిన భామ (అంటే అమ్మ తనగురించి చెప్పుకుంటూ) పద్మాల మొగ్గలతో చేసిన పానుపు నీకు పరచి సిద్ధంగా ఉంచినది. వేయిమార్లు అధరామృతంతో నీకు విందు చేసినది. ఆరంభములోనే అంకురార్పణతోడుగా నన్ను నీవు కలిసావు గదా! మధ్యలో ఈ పైటచాటుమాటలేల దగ్గరకు రావయ్యా శ్రీవేంకటపతీ! అని అమ్మ అర్థిస్తోంది.

**అర్థాలు:** వాడికలు = రహస్యాలు, వందిలి = ఆపద, ఉడివోని = మొదటి మినుకులు, వేదాలు, ప్రాబలుకులు, దడిగట్టెను = మాట్లాడనీయక నిర్బంధించు, యెడమాట = వెలుపల ఉండి మాట్లాడే మాట, కలికి = అందమైన లేక మనోజ్ఞమైన స్త్రీ, సూడిదలు = కానుకలు, సెలవు = వ్యయం అనే అర్థంలో వాడిన పదం, వెలి = బయట, జంపు = ప్రేమతో చంపుతున్నాడని సుకుమారంగా సున్నితంగా చెప్పడం, తమ్మి = పద్మం, వేమరు = వేమారు అనే పదానికి గ్రామ్యం అయిఉండవచ్చు లేదా తరచు అనే అర్థం కూడా ఉంది, మోవితేనె = అధరామృతం, ఆముక = ప్రారంభం, అంకురార్పణం, దామెలసన్న = ఈడొచ్చిన కన్నెపిల్లలు వేసుకొనే పైటలాంటి వస్త్ర విశేషము.

**-000-**